Reg. No. 757

# అభినవసరస్వతి

యను నొక మాసపత్రిక.

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథక[ర్త]

జానపాటి పట్టాభిరామశాస్త్రిచే[త]

ప్రచురింపఁబడుచున్నది.

జానపాడు



సంపుటము 19 | 1927 సం॥ సెప్టెంబరు నెల. | సంచిక 6

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0   సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0   చందాదారులకు 3 0 0

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

## ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, గుల్బరగా జిల్లా
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, మడికొండ
౩ బాకరాజు పరాంకుశరావుదేశాయిగారు. యాదవరం.
౪ రామసింగుగారు-నెల్లుట్లసాపురసంస్థానముల మేనేజరు- నెల్లుట్ల.
౫ శ్రీమద్వెంకట శేషారెడ్డి రామచంద్రారెడ్డి దేశముఖుగార్లు, అల్లాదుర్గసంస్థానము.

## పోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు, విశాఖపట్టణంజిల్లా.
౨ ఎనమండ్ర లక్ష్మీనరసింహముగారు, మర్చెంటు, బెజవాడ.
౩ రాజా వెంకటాద్రియప్పారావు, బహదరుగారు, వుయ్యూరుయెస్టేటు.
౪ రాజామంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగిరి.
౫ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.
౬ శ్రీరామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౭ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౮ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౯ టి. లక్ష్మణసింగుగారు, జోనగాం
౧౦ నెల్లుట్ల నరసింహారావుగారు, జోనగాం
౧౧ రంగాచార్యులుగారు, ముక్త్యారు, దేశముఖు, మసీదుపల్లె.
౧౨ టేకులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.
౧౩ జాగర్లమూడి కుప్పుస్వామినాయఁడుగారు, కారంచేడు
౧౪ పిశుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౫ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, ఇంగోలి.
౧౬ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానుకొండూరు
౧౭ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం
౧౮ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి దేశముఖుగార్లు-నారాయణపురం

---

## సహాయులు

౧ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౨ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ
౩ సంగెం రామారావుగారు, కుంటుపల్లి.
౪ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౫ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, నెల్లుట్ల
౬ రంగాచార్యుల రంగయ్యగారు, నర్సారావుపేట
౭ నారాయణరావుగారు, దాతారుపల్లె

# చందాదారులు

౧ సింగీతం అమృతరావుగారు, మక్తేదారు - కొన్నె

౨ దరూరు పద్మారెడ్డి దేశముఖుగారు-కడవెరుగు

౩ ఆగంరెడ్డి మొకద్దంగారు-నాగిరెడ్డిపల్లె

౪ గూడ వెంకటరామారెడ్డి దేశముఖుగారు-[illegible]లపల్లి



౫ గుంటుపల్లి పేరయ్యగారు, కరణం-చెన్నుపల్లి

౬ గొడుగుల సుబ్బయ్యగారు-కొప్పర్తి

౭ అక్కిరాజు వాసుదేవరావుగారు, కరణం-గుత్తికొండ

౮ రాచకొండ యజ్ఞనారాయణగారు, గారపాడు

౯ జంధ్యాల చినసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, మునిసిపల్ హైస్కూలు తెలుగుపండితులు-నర్సారావుపేట

౧౦ దెందుకూరు బ్రహ్మందీక్షితులుగారు, గుంటూరు

౧౧ వకీలు శంకరరావుగారు, మాచాయపేట

౧౨ బిదరు కృష్ణయ్యగారు, తూపరాణి

౧౩ నారాయణరెడ్డి దేశముఖుగారు, మొలుగు

౧౪ మొలుగు రామయ్యగారు, మసీదుపల్లె

౧౫ నరసింహారావుగారు, బొంతపల్లి

౧౬ ఇంజనంపాటి అనంతయ్యగారు, కరణం-ఉప్పలపాడు

౧౭ శ్రీగిరిరాజు లక్ష్మీనరసింహముగారు, తాళ్ళూరు

౧౮ బాకరాజు రాజేశ్వరరావు, దేశముఖుగారు-దుండిగళ్ళు

౧౯ ఇంద్రకంటి బలరామయ్యగారు, మేడిచెలిమ

౨౦ ధాత్రిక సీతారాంబాలోజీగారు, మేడిచెలిమ

౨౧ సి. విఠలరావుగారు, హైదరాబాదా

౨౨ జగర్లపూడి అమరనాధశాస్త్రిగారు, సికిందారాబాదా

౨౩ బుర్రా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, సికిందారాబాదా

౨౪ ముదిగొండ లింగయ్యశాస్త్రిగారు, సికిందారాబాదా

౨౫ మల్లావఝ్ఝుల రాజగోపాలంగారు, భువనగిరి

౨౬ యువజనసంఘము, జానగాం

౨౭ మల్లాది పున్నయ్యగారు, నర్సారావుపేట
౨౮ చింతలపాటి రామమూర్తిశాస్త్రిగారు, గుడివాడ
౨౯ పురాణం రామలింగశాస్త్రిగారు, గుంటూరు
౩౦ భువనగిరి బుచ్చిపరదేశిసోమయాజులుగారు, సబ్జడ్జికోర్టు క్లార్కు-గుంటూరు
౩౧ చావలి వెంకటకృష్ణయ్యగారు, జిల్లాకోర్టువకీలు-నర్సారావుపేట
౩౨ నడింపల్లి జగన్నాధరావుగారు, ప్లీడరు-నర్సారావుపేట
౩౩ తాడేపల్లి సంపూర్ణలక్ష్మీనారాయణగారు, జిల్లాకోర్టు ప్లీడరు నర్సారావుపేట
౩౪ కొండుభట్ల గోపాలకృష్ణయ్యగారు, ప్లీడరు-నర్సారావుపేట
౩౫ అన్నం రామయ్యగారు, పెన్షన్ డ్ మేజస్ట్రీటు-దాచేపల్లి
౩౬ లంకా సుందరరామశాస్త్రిగారు, అంబాపురం
౩౭ జంధ్యాల శివన్నశాస్త్రిగారు, హిందీపండిట్-గుడివాడ
౩౮ మోతె నారాయణరావుబహదరు జమీందారుగారు, ఏలూరు
౩౯ గుండు శేషయ్యగారు, స్కూల్మేష్టరు-చేటపర్రు
౪౦ చెన్నూరి లక్ష్మీనరసింహారావు, దేశపాండ్యాగారు-గొర్లగూడెం
౪౧ ద్రోణా సోమయ్యగారు, సర్వవరం
౪౨ సరావు కిషన్ రావు, దేశముఖుగారు-అనంతవరం
౪౩ వకీలు వెంకటరెడ్డిగారు, బోడంపహాడు
౪౪ కనకదండి సూర్యనారాయణరావుగారు, పోలీసు సబినస్పెక్టరు మరకలు
౪౫ నెల్లుట్ల శేషగిరిరావు, దేశపాండ్యాగారు-కూనూరు
౪౬ నరసింహారావుగారు, మక్తాదారు-గావులపల్లి
౪౭ భమిడిపాటి సుబ్రహ్మణ్యంగారు, పెదపులివర్రు
౪౮ రాజా విక్రమదేవవర్మగారు, విజయనగరము
౪౯ పుల్చి రామయ్యగారు, పేరికెలపూడి
౫౦ కంచిరాజు శంభయ్యగారు, మల్లారెడ్డిగూడెం
౫౧ దంటు లక్ష్మీకాంతరావుగారు, సుద్దపల్లి
౫౨ ఎల్లేపెద్ది సాంబశివశాస్త్రిగారు, జిల్లాకోర్టువకీలు-గుంటూరు
౫౩ కంభంమెట్టు ప్రసాదరావుగారు, ర్యాలియాఫీసుక్లార్కు-గుంటూరు

# అభినవసరస్వతి

సంపుటము ౧౯ { జానపాడు / ప్రభవ సం॥ భాద్రపదమాసము } సంచిక ౬

## సవరణ

మా యభినవసరస్వతి 19 వ సంపుటము 1 వ సంచికయం దాదిశైవ పత్రికను విమర్శించుటలో నాదిశైవులనఁగా శివబ్రాహ్మణులు-అనఁగా శివార్చకులు (తంబళులు) అని ప్రచురించియుంటిమి. నెల నెలకువచ్చు నీ యాదిశైవపత్రికను బూర్తిగాఁ బరిశీలించుటవలన శివార్చకులు మూఁడుతరగతులుగాఁ గలరని తెలిసికొనఁబడెను ... ...

(1) శ్రీ శ్రీకంఠశివాచార్యమతావలంబులును దుర్వాసోమహర్షి సాంప్రదాయులును కౌశికాదిగోత్రజులును శైవవైదికమార్గప్రవర్తకులును సకలాగమపారావారపారీణులును నిరంతరశివారాధనాతత్పరులును నగు నాదిశైవులనుపేరుగల శివార్చకు లాంధ్రదేశమున గోదావరీతీరమున నుద్భవించి చోళమహారాజుగారి యాహ్వానముపైఁ జోళ పాండ్యకర్ణాటాదిదేశములపర్యంతము వ్యాపించియున్నారు. వీ రుత్తమ శివద్విజులు.

(2) ఇఁక రెండవతరగతివారు కురు, సృంజయ, పాంచాలదేశములందుఁగల శివాలయములలో నర్చకత్వముఁ జేయుచు వేదబాహ్యాగమ తంత్రములతో నొక్క శివలింగమునకుమాత్రమే పూజచేయుచుఁ గర్మభ్రష్టులై వర్తించుచున్నారు. వీరు మధ్యమ శివద్విజులు.

(3) మూఁడవతరగతివా రుత్కళ, వంగదేశములం దుద్భవించి నిజామురాష్ట్రమువఱకు వ్యాపించి యెవరియింటిలో వివాహాదికార్య

ములు జరిగినను మేళగాంద్రతోఁ జేరి డోళ్లు మొదలయినవి వాయిం చుచు శూద్రతుల్యులై మత్స్యమాంసాదుల భుజించుచు శాపదగ్ధులై తంబళులను పేర వ్యవహరింపఁబడుచు శివాలయములలో నర్చకులుగా నున్నారు ... ... ...

పైవార లోకరీతిలో నొకరు సంబంధబాంధవ్యములుగాని భోజనాదులుగాని గల్పించుకొనక ప్రత్యేకముగా నున్నటుల .స్కాందాది పురాణములందుఁ గలదని సప్రమాణముగా వ్రాయుచున్న యాదిశైవ పత్రికను బరిశీలించి యిట్లు సవరింపఁబడియె.

---

# ఆంధ్రుల సాహిత్య మహాసభ.

---

ఆంధ్రుల ప్రస్తుత వాఙ్మయస్థితిని తదభివృద్ధిమార్గములను మరికొన్ని ఆవశ్యకవిషయములను సమాలోచనము చేయుటకు గుంటూరు జిల్లా దాచేపల్లిలో ఈ సంవత్సరము ... సాహిత్యమహాసభ జరుగును. సభానిర్వాహణార్థము సమావేశ సంఘ మేర్పడినది. తాలూకా బోర్డు అధ్యక్షులగు శ్రీ కోలా కేశవరెడ్డిగారు ఆహ్వానసంఘమునకు అధ్యక్షులుగాను, శ్రీ తంగెడ నరసింహారావుగారు, వారణాసి లక్ష్మీనారాయణగారు, కన్నెకంటి చినలింగాచార్యులుగారు కార్యదర్శులుగాను నియమితులైరి. పణ్డిత ఉమాకాన్త విద్యాశేఖరులు సభకు అధ్యక్షత వహించ అంగీకరించిరి. పనులు జరుగుచున్నవి; కార్యక్రమము తేదీ త్వరలో ప్రకటించబడును. విద్వాంసులు విచ్చేసి తమ వ్యాసములను సభకు ప్రసాదించి తోడ్పడవలెనని ప్రార్థించుచున్నాము. ... ... ...

కన్నెకంటి చినలింగాచార్యులు,

సమష్టి కార్యదర్శి.

---

# ఆంధ్ర సాహిత్యమహాసభాతత్త్వము.

ఆంధ్రమహాజనులారా!

పై ప్రకటన త్రిలింగపత్రిక కావించినది. తచ్ఛీర్షికయొక్కయు లోపలి విషయములయొక్కయు గాంభీర్యమును గాంచి కొందఱది యేదో లోకోపకారకమైన గొప్ప సభయనియు నందు భాషాభివృద్ధికి సముచితములగు నూతనమార్గములు చూపఁబడుననియు భ్రమించుచున్నారు. కాని యీసభలో సిద్ధాంతముసేయఁబోవునది యతిప్రాసలు లేకుండ నాంధ్రకవిత్వము చెప్పవలసినదని - ఇట్టిత్రోవలు మంచివి కావని

శ్లో॥ స్వాధీనో రసనాంచలః పరిచితాః శబ్దాః కియంతః క్వచిత్
క్షోణీంద్రో న నియామకః పరిషద శ్శాంతా స్వతంత్రం జగత్
తద్యూయం కవయో వయం వయమితి ప్రస్తావనాహంకృతేః
స్వచ్ఛందం ప్రతిసద్మ గర్జత వయం మౌనవ్రతాలంబినః (సాహిత్యరత్నాకరము)
అనియు,

సీ॥ అష్టభాషలను వాగనుశాసనుండైన నన్నయ్యకవి పెంచినాఁడు మున్ను
ప్రేమానుబంధంబుతో ముద్దుముచ్చటల్ తిక్కన్నకవి మున్ను తీర్చినాఁడు
పరువుగాఁ బల్లకీపై సర్వదేశముల్ శ్రీనాథకవి మున్ను త్రిప్పినాఁడు
లలితశయ్యారసాలంకార వస్తువుల్ పెద్దన్నకవి మున్ను పెట్టినాఁడు
ఆంధ్రభాషావధూటి శ్రేయార్యులార! యిచ్చవచ్చినయట్లు మీ నచ్చినట్లు
నగలు నాణెంబులును బంపనగును గాని సూత్రమును ద్రెంపకుఁడి యాంధ్రశూరులార!
(తిరుపతి వెంకటకవులు)

అనియుఁ గొందఱచే స్వాభిప్రాయములు వెల్లడింపఁబడియున్నవి. మఱియు

మ॥ అతిసౌందర్య విలాస భాసుర సతీ! యాంధ్రాంబ! నీకీ యెడన్
యతులు న్ప్రాసము లుండ నేటికనుచు న్వ్యాసంబులన్ వ్రాసి దు
ర్మతబోధల్ గడుసేయుచు న్నియమముల్ బాపింపగానీక ధూ
ర్తతనం బొప్పగ వాదముల్ సలుపుచున్ దైన్యంబునొందించి నీ
చతురత్వంబును బాపువారు కద స్వేచ్ఛావర్తులౌ కాకవుల్॥

సీ॥ రాజరాజనరేంద్రరాజన్యకడఁబుట్టి రెడ్డిభూపాలుర ప్రేమఁబెరిగి
కృష్ణరాయనృపాలకృప నలంకృతిఁగాంచి రఘునాథవిభుచెంత రాణనొప్పి
విజయరామాదిభూవిభులసభలఁ గ్రాలి శ్రీవేంకటాద్రి సత్కృతి వహించి
ఆంగ్లనృపాల పాఠాలయంబుల నిటీవలదాక పటుతాండవంబు సల్పి
తనరితివి యాంధ్రభాషామతల్లి నీవు నియమముల బాపి గ్రామ్యోక్తి నేర్పి యిపుడు
సభ్యతనుమాన్పి సౌందర్య సరణి ద్రోసి దుస్థితికి దెచ్చిరిగద యీ ధూర్తకవులు॥

సీ॥ నిన్ను బ్రేముడిఁగన్న నన్నయార్యును బేర్మి నెత్తినసత్కవిహితుడు తిక్క
యజ్వ నిన్ బోషించినట్టి శ్రీనాథుండు నిను బ్రకాశింపఁజేసిన మహాత్ము
లగు సోమకవి భాస్కరామాత్యకవియును నీకుబల్ జిగిబిగి నిగ్గు ముద్దు
పలుకులు నేర్పిన ప్రౌఢులౌ పెద్దనార్యకవియు నంది తిమ్మకవిముఖులు
ఇట్టి నీ దుర్దశనుగన్న నెంతయైన నోర్తురే నిన్నుగలచు ద్రోహులఁ, గొలంది
కాలమున కీవు మేలొందఁ గలవు కాన జడియకిక తల్లి! యాంధ్రభాషామతల్లి!

ఉ॥ నీ మొర యాలకింప ధరణీవిభు డొక్కరుడైన నిల్వమిన్
మే మొక కుత్తుకన్ దగ నమేయప్రయత్నము లెన్ని సల్పినన్
కోమలి! నీకు శ్రేయ మొనగూడక యుండుటఁ గాంచి కృష్ణుడే
క్షేమముఁగూర్ప శ్రీపదము చెల్వుగ బూనెను వజ్రపాణియై॥

చ॥ కులము నవీన నాగరికకోటులచే నిపుడెల్ల సంకరం
బులబడి బాములొందుక్రియ మూర్ఖులచేఁబడి నీవుకూడ ని
స్తులదురవస్థలంబడఁగ జొచ్చెడికాలమువచ్చె నంచుఁ జిం
తిలకు కలిప్రభావమది నీవిధమట్టిది కా ద దెట్లనన్
కాలదికవుల్ నినుం బెనుపఁగోరి ప్రయత్నముజేసి తద్విధం
బులఁ దెలియంగలేక యొక మూర్ఖపథంబువహించి దానిచే
సలలితమార్గగామినయి సాగగజేయఁగనెంచి తా రెదన్
దలచినభంగి గ్రామ్యపదతండములన్ జొనుపంగఁజొచ్చి నీ
లలితపదప్రచారణ విలాసము మార్పడజేసినా రికన్
గలితయశస్కులౌ సుకవికాండము నీదగు తొంటిసోయగం
బలరగజేయఁ బత్రికల వ్యాసములం బ్రకటించి వాదముల్
సలుపుచుఁ జాల యత్నములు జక్కగజేయుచు నుండిరిప్పు డం

గళమగు నీ వికాసమిఁక గ్రాలును వైభవమొప్ప నీ మదిన్
గళవళ మొందబోకుము సుఖంబుగనుండెద వాంధ్రవాక్సతీ!

(మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ)

అని యోదార్చుచున్నారు. దిఙ్మాత్రము చూపితినిగాని యిట్టివి పెక్కులున్నయవి. కావున నేతత్సభాతత్త్వమును గ్రహించి తదుపదిష్ట విషయము లనుష్ఠానమునఁ బెట్టకుండుట కళలాంధ్రులును నభ్యర్థితులు.

ఈ సభయభిప్రాయ మిదియని ఋజువుచేయుట కుమాకాంత విద్యాశేఖరుల శిష్యుని పద్యములు కొన్ని యీక్రిందఁ బొందుపఱచుచున్నవాఁడను. ఉమాకాంతవిద్యాశేఖరులే యీసభ కధ్యక్షులనునది యందే కాననగును.

శా॥ పూర్వుల్ బోవుపథంబు నేఁడు విడుటల్ మే మొప్పమం చందురా
వాల్మీకి ప్రముఖుల్ పురాతనులె కా తన్మార్గమే త్రొక్కుడీ
విద్వద్వర్యులు! వారు పూజ్యులగుటల్ కల్లా కవుల్ గారొకో
యీ నన్నయ్యయు నెఱ్ఱనాభిధునయుం తిక్కన్నయుం జాలరా॥ 1

ఉ॥ విశ్రమ మన్పదంబునకు నర్థము జెప్పుడి అగుటేకదా
విశ్రమ మన్న పైనగల అక్షరమే నని యెడనుండెనో
బల్కుడి కాళిదాసకవి ముఖ్యులు నెందున నైన జెప్పిరే
సంస్కృతమార్గ మద్ది యిది ఆంధ్రపథమ్మన దాని తెల్పెదన్॥ 2

క॥ సంస్కృతములోని వేకద వృత్తము లాంధ్రమ్మునందు బెట్టిరి వాటిన్
అత్రోవ భగ్న మొనరిచి భావవిహీనంపు పథము ద్రొక్కం దగునే॥ 3

తే॥ ప్రాత దన్నంతమాత్రాన ఘనముగాదు క్రొత్త దన్నంతమాత్రాన గొప్పగాదు
దుష్టమైనది యెుదియేని విడువవలయు గుణము లుండిన దాని గ్రహించ నగును॥ 4

తే॥ వ్యర్థశబ్దములో గుంపుగణము లెన్నొ భూప్రికాశగుణంబులు గూర్చి కవిత
పాడుజేసిన దాన నే గుణము లమరు వళుల ప్రాసల లాభ మీ వెంటగాదె॥ 5

క॥ వాగింద్రియ విశ్రాంతియు పద్యార్థ సుబోధతయును శ్రావ్యత్వమ్మున్
గూర్చెడి యతి గోల్పోవుట ఆంధ్రుల పద్యాల భాగ్యహాతియే గాదే॥ 6

ఈ పద్యములపై బయలువెడలిన క్రింది ఖండనమునుగూడఁ దిలకింతురుగాక.

# ఆంధ్ర కవిత్వమున యతి నిషేధింపఁ దగునా?

ఆంధ్రిలపద్యమను ఖారతక్షరముల శీర్షిక గల పైపద్యపత్రకమును మొన్న చూచి చాలఁ జింతిల్లితిమి. ఈ పద్యములు నిజముగా నాంధ్రిల పద్యములు కావని మా యభిప్రాయము. ఇవి యన్నియు యతిప్రాసరహితములై, గ్రామ్యపదయుతములై, యొప్పుచున్నవి. ఈ పద్యముల ముఖ్యభావము తిక్కనాదులు కవిత్వముఁ జెప్పిన విధము 'దుష్టమైనది' కావున దానిని 'విడువవలయు' ననియు యతిప్రాసలు లేకుండఁ జెప్పు మార్గమునందు 'గుణములున్నవి' కావున; దానిని 'గ్రహించ' వలె ననియుఁ గన్పట్టుచున్నది.

దీనిని వ్రాసినవారు శతావధాని కస్నకంటి ప్రభు లింగాచార్యులుగారని ఆయన వ్రాసికొనినదానిఁ బట్టి తెలిసికొననగును. వీరి శతావధాన పద్యముల నెప్పుడును జూచు నదృష్టము మాకుఁ బట్టలేదు కాని, యవి యతిప్రాసలులేకుండ వ్యాకరణ విహీనములై, 'భావవిహీనంపు పథము' ద్రొక్కక నవనవ భావయుత పథమునే త్రొక్కి, సమంజసముగ నుండునని తోఁచెడిని. వీరి నామమును బట్టి చూచిననేమి, క్రింద 'శ్యామాకాంతు' డని కుండలీకరణములోని చిహ్నము వలన నేమి, వీరు విశ్వబ్రాహ్మణులవంటి శైవమతస్థులని శంకింపవలసియున్నది. ఆంధ్ర కవిత్వమునందుఁ బది శతాబ్దములఁ బట్టి వచ్చుచున్న మహాభారత కవులచే నుపయోగింపఁ బడిన, పెద్దనాద్యష్టదిగ్గజములచే లాలింపఁబడిన, యతిని నేఁడీ యాచార్యులవారు పద్యములచే—షడక్షరిచే భూతమును పారఁద్రోలు భూతవైద్యునివలె—భస్మముఁ జేయఁ దలపెట్టినారు. ఇది ముమ్మాటికిఁ దప్పని మా యభిప్రాయము. సంస్కృత కవిత్వమున యతి లేనిమాట సత్యము కాదని మే మనము. కాళిదాసుఁ డట్లు రచింపలేదని మే మనము. కాని; సంస్కృతమున వ్యాకరణముఁ గూడ భస్మీపటలముఁ జేసియే వాల్మీకి తన రామాయణమును వ్రాసెనా? మన యాచార్యులవారు 'వానిక్ అనుటకు వాటిక్' 'దానిఁ దెల్పెదక్ అనుటకు దాని తెల్పెదన్' మున్నగు మహా ప్రయోగములను వాడిరే! ఇట్లు వ్యాకరణమును గమనింపకుండ నే సంస్కృతకవి తన గ్రంథమును వ్రాసెనో 'పల్కుఁడి'. ఏది యెట్లున్నను 'జందెము విసర్జించిన సన్న్యాసి తండ్రి

యాద్దికములకు లెక్కసేయునా' యన్నట్లు యతి ప్రాసలను విడిచిన వీరు పదౌచిత్యమును, వ్యాకరణ సూత్రములను, అర్ధబిందువులను గూడ విసర్జించి యుండవచ్చును. శ్రీయుత సెట్టి లక్ష్మీనరసింహముగారు గ్రామ్యభాషావాదియైనను యతులకుఁ బ్రాసలకుఁ గొంచెము గౌరవముఁ జూపి 'స్త్ర' ప్రాసగల పద్యమును వ్రాసిరి. కాని మన శతావధానిగారు గ్రామ్యపదముల వాడుటయే కాక యతులను ప్రాసలను గూడ వదలి 'గుడి మ్రింగినవాని' ధీరత్వమును బొందఁ గలిగిరి. అయినను, వీరు యతులను వదలినను కొన్ని కొన్ని చోట్ల యతు లాచార్యులవారిని వదలక భూతములవలెఁ బీడించుచున్నవి. మూఁడవ పద్యమున "వృత్తము లాంధ్రమ్మునందుఁ • బెట్టిరి. వాటిన్" అనుచోటను నాల్గవ పద్యమున 'క్షాత్రదన్నంతమాత్రాన • గొప్పగాదు' అనుచోటను, చివరి పద్యమున 'ఆంధ్రుల పద్యాల భాగ్య • హాతియే కాదే' అనుచోటను యతులు కానంబడియెడి. అనుకొనకుండ ఘుణాక్షర న్యాయమునఁ బడిన వీనిగురించి యిచ్చట మేము విపులముగా విమర్శింపఁ దలఁచుకొనలేదు. మఱియు వీరు ప్రయోగించిన దుష్టప్రయోగముల, నన్వయ స్ఖాలిత్యముల గూర్చి పరిశీలించుట కిచటఁ దావు లేనందువలన వారి భావములనే ఖండించుచున్నాము.

వీరు వ్రాసిన యీఱు పద్యములలోను వీరి వాదములను బలపఱచుటకుఁ జెప్పిన ముఖ్యకారణము లైదు. వాని నీ క్రిందఁ బొందుపఱచెదము.

(1) తిక్కనాది పూర్వకవులు యతుల వాడిరి, అంత పూర్వమునుండి వచ్చిన యతిని నేడు విడువలేమందురేమో, ఇంతకంటెఁ బురాతనులు వాల్మీకి మొదలుగాఁగల పండితవర్యులు సంస్కృతమున యతి లేకుండ శ్లోకముల వ్రాసిరి కావున మనకు యతి అవశ్యకములేదు. ఆ సంస్కృతకవు లీ తిక్కనాదులకుఁ జాలరా?

(2) విశ్రమమను పదమున కాఁకుటయే యని యర్థము. కాని 'మైనఁగల అక్షర' మని యెచ్చటను లేదు. కావునఁ దెలుఁగులో నుండు నక్షర మైత్ర్యాదు లన్నియు విసర్జనీయములు.

(3) వృత్తములు సంస్కృతములో నుండియే ఆంధ్రమునఁ బెట్టిరి. కావున మాతృకలో లేని యతి పుత్రికలో నేల యుండవలెను?

(4) యతిప్రాసల మూలముననే యాంధ్రభాష యంతయుఁ బెంటయైనది.

(5) వాగింద్రియ విశ్రాంతి, పదార్థసుబోధత, శ్రావ్యత్వముగల సంస్కృత యతి యుండవలెఁ గాని, తెలుఁగులో వాడు యతి మంచిది గాదు. అట్టి నంచి యతిని దొరంగుట ఆంధ్రపద్యముల భాగ్యము పోవుట కాదా?

ఇవి వరుసగా వారి 1, 2, 3, 5, 6 పద్యములలోనున్న విషయములు. నాల్గవ పద్యము ప్రస్తుతాంశమునకుఁగొంచెము సంబంధించినదే యైనను, అదియొక నీతినిబోధించును. దానిని మనము నేర్చుకొనుటలో నేమియుఁ దప్పులేదు. ఆనీతి యేమనఁగా.

‘ప్రాత దన్నంతమాత్రాన ఘనము గాదు, క్రొత్త దన్నంతమాత్రాన గొప్ప గాదు,
దుష్టమైనది యెద్దియేని విడువవలయు గుణములుండినదాని గ్రహించనగును’

కాని యీ నీతి వారి వాదమున కెట్లు పనికివచ్చునో మేము గ్రహింపలేకున్నాము. ఆంధ్రకవిత్వపద్ధతి దుష్టమనియు; నాంధ్రమున యతిలేక పద్యములు చెప్పుట గుణములున్న మార్గమనియు దృఢముగా ఋజువు చేసినచో; నా నీతి వలన లాభముండునేమో కాని, యేమియు లేక యొక ధర్మవాక్యమును జెప్పినంతమాత్రమున వారివాదము నిలఁబడునా? నీతిశాస్త్రము నంతయు వల్లించుచు నొనర్చిన జారత్వము దోషరహితము కాదని వారు గ్రహించుకొందురుగాక! ఇఁక మిగిలిన విమర్శనా భాగమును, వారి కారణముల నొక్కటొక్కటిగా ఖండించుచు నీ క్రిందఁ బొందుపఱిచెదము.

(1) వాల్మీకి ప్రముఖులు పురాతనులు, విద్వద్వర్యులును కావున వారి విధము ననే వ్రాయుటకు మనము ప్రయత్నింపవలెను. వారు సంస్కృత శ్లోకములఁ జెప్పు సందర్భమున యతిఁ మానిరి కాని, యాంధ్రపద్యముల వ్రాయుచున్నపుడుగూడ యతిని మానెదరో, లేదో మన యాచార్యులవారి కెట్లు తెలియును? కావున మేమును సంస్కృత శ్లోకముల వ్రాయునప్పుడు యతిని వాడు నియమమును బెట్టుకొనమని శ్రీ యాచార్యులవారి సముఖమునఁ బ్రమాణముఁజేయుటకు సంసిద్ధులమై యున్నాము.

తెలుఁగు కబ్బముఁ జేయువారము తెలుఁగు కవుల ననుకరింతుముకాని సంస్కృత కవుల పద్ధతినంతయు నవలంబింతుమా? ఉర్దుపండితులవలెఁ గుడిచేతివైపునుండి యెడమ చేతివైపునకు వ్రాయ సిద్ధపడుదుమా? ఆంగ్లేయ కవులవలె (పెంటామెటర్) లోఁ బ్రబంధములను రచింతుమా? అట్లు సంస్కృత మహమ్మదీ యాంగ్లభాషాసాంప్రదాయములఁబట్టి తెలుఁగు కవిత్వముఁ జేయనియెడల కాళిదాసు, ఖాసింఖానా, షేక్స్పియరు మొదలగువారు కవులుగారని మనము తలంచుచున్నట్లగునా? అదియుఁగాక వారు తిక్కనాదులకంటెఁ బురాతనులుఁ గావునఁ దన్మార్గమును ద్రొక్కుమనుట, వారి నాల్గవపద్యమందలి ‘ప్రాతదన్నంతమాత్రాన ఘనముగాదు’ అనెడి పాదమునకు విరోధముగాఁ గనఁబడుచున్నదేల? తా నొకరీతిని బోధించుచు దానికి విరుద్ధముగాఁ దామే పెడత్రోవఁ ద్రొక్కినచో నిం కెట్లు?

అదియునుఁగాక తిక్కనాదులకు వాల్మీకి ప్రముఖులు చాలరా యని యొక గొప్ప కాకుస్వర ప్రశ్న వేసిరి. కాని మహాత్ములలో నెక్కువతక్కువలు గణించి పోల్చి చూడఁ గూడదనియు, సంస్కృతకవులకుఁ దెలుఁగు కవులకు పోటీ పెట్టుట పాపమనియు, శ్రీ యాచార్యులవారికిఁ దెలియలేదు కాఁబోలు. విష్ణుమూర్తి గొప్పవాఁడా, సాంబమూర్తి గొప్పవాఁడా యని శంకింపఁదగునా? దీసఁబట్టి యాలోచించిన శైవమతస్థులగు శ్రీ యాచార్యులుగారి విష్ణుమూర్తికి శివుఁడు చాలఁడా? యని ప్రశ్న వేయుటకు సమర్థులని యూహింపవలసియున్నది. మా కాంతునికంటె మమాకాంతుఁడే యొక అతురము గొప్పవాఁడని సమర్థించుకొనుటకుఁగూడ శక్తిగలవారు వాల్మీకి ప్రముఖులు తిక్కనాదులకుఁ జాలిరో, చాలరో మనము చెప్పలేముగాని, మన తిక్కనాదు లీయాచార్యులవారికిఁ జాలరా? ఇంక రెండవ విషయమునకు వత్తము.

(2) ఏదియైన నొక వృత్తముఁ జదువుచున్నపుడు చదువుసరళిలోఁ బాద మధ్యమున నొకచో స్వాభావికమగు నాపు కలుగును. 'బాల రసాలసాల నవ పల్లవ కోమల కావ్య కన్యకన్' అని చదువుచున్నపుడు 'బాల రసాల సాల నవ' అన్న పిమ్మట నొకవిధమగు విశ్రమమును వాగింద్రియమేమి, శ్రవణేంద్రియమేమి, యనుభవించి తీరును. ఇట్టి విశ్రమము గణయుతమగు నేపద్యములోనైన నుండితీరును. శతావధాని గారు వ్రాసిన 'విశ్రమమన్నదంబునకు నర్థము చెప్పడి అఁగుటేకదా, అను పాదములో సహితము 'విశ్రమమన్నదంబునకు' అను పిమ్మట నొకవిధమైన విశ్రాంతి యున్నదని వారే యొప్పుకొనక తీరదు. అట్టి విశ్రాంతి ప్రతివృత్తపాదమందుండునను విషయమును బోధించుట కుద్దేశింపఁబడిన పదము విశ్రమముగాని పైనఁగల అక్షరమని చెప్పుటకు నిర్ణయింపఁబడినది కాదు. "పైనఁగల యక్షరము" అనెడి పదసమూహమే మాకు సమంజసముగఁ దోచుటలేదు. అది నిజమగు నర్థమును స్పష్టీకరించుటలేదు. ఏలనన, దేనిపైనఁగల యక్షరమని మేమూహింతుమని శ్రీయాచార్యులుగారనుకొనిరో మాకు బోధపడుటలేదు.

అట్టి విశ్రమము వచ్చుచోటునకు విశ్రమస్థానమని పేరు. ఆంధ్రపద్యపాదముల యందావిశ్రమస్థానమున మొదటి యక్షరమునకు మైత్రిగల యక్షరమునే వేయవలయు నను నియతి, శ్రవణేంద్రియమున కింకను 'హాయి'ని గల్పించుటకు మన కవులేర్పఱిచిరి. ఇట్టి నియతినే యతి యందురు. అదియుఁగాక, విశ్రమమను పదము ఛందస్సులో నుపయోగింపఁబడు, ఛందస్సులకు సంబంధించిన యొక పారిభాషిక పదము (టెక్నికల్ టరమ్) కాని, దానిలోఁ బైయర్థమంతయు నెట్లిముడును? దానికి బూర్తియగు ఛందోపరమునఁ జెప్పు నర్థము ఛందస్సులో నుండుఁగాని లింగాభట్టీయమున నుండునా? గణ

మను పదమున కక్షరగణమే యని యేల ననుకొనవలెనో ! గణములఁగూడ విసర్జించిన యొక మహానుభావుఁడు, గణముల నుపయోగించు శ్రీయాచార్యులవారి నడిగిన నేమి సమాధానమిచ్చెదరో; యతి, గణము, ప్రాస మొదలగు మాటలకు ఛందోపరమున గ్రహింపవలసిన యర్థము, వాని కేవలార్థములకు భేదించియుండక తీరదు. యతి యను మాటలో మన శతావధానిగారికి యతీశ్వరుఁడు కనఁబడుచున్నాఁడు కాఁబోలు. ఈ యతి సంస్కృతభాషలో లేకపోయినను, సోదరభాషలగు కన్నడము, అరవము మొదలగువానిలోఁ గలదని వారు తెలిసికొందురుగాక !

ఇంకను మన యాంధ్రపద్యములను జంపె, త్రిపుట, అట, ఆది మొదలగు తాళములతోఁగూడ లయవేసి పాడునట్టివారు కలరు. అవి వారు పాడుచున్నపు డాంధ్రకవిత్వమందు విశ్రమస్థానమున నక్షరసామ్యముండుటవలని లాభము శ్రీయాచార్యులవారు తెలిసికొందురు. అదిగాక శతావధానిగారు వ్రాసిన యతిశూన్య పద్యములను పైనఁ జెప్పినవిధమున లయవేసి పాడినచో, యతిలేని నష్టముగూడఁ దెలియును. నొసట బొట్టు లేని పుణ్యస్త్రీనిఁ జూచిన, చక్షువున కెంతసొంపుగా నుండునో, వీరిపద్యములను లయ వేసిపాడుచున్నపుడు విను చెవి కంత యింపుగా నుండును ఇంక మూఁడవ యంశమును విమర్శింతము.

(౩) వృత్తములు సంస్కృతములో నుండియే తెలుఁగునఁ బెట్టిరి. కేవలగణములను తెలుఁగునఁ బెట్టుటయే గాక, కర్ణేంద్రియసౌఖ్యమునకై యక్షరసామ్యము నదనముగా మన యాంధ్రకవులు కల్పించిరి. పద్యమైనను, శ్లోకమైనను, దోహరైనను మన చెవి కింపుగా నుండుటకే గాని వేఱొకటి కాదు. కేవల భావప్రకటన కొఱకే యైనచో వచనమే కడుంగడు ప్రశస్తమని తెల్లియనగును. సంస్కృతమునుండియే వృత్తము లాంధ్రమునఁ బెట్టిరని, పూర్తిగా సంస్కృతశ్లోకములవలెనే యాంధ్రపద్యము లుండవలెనా ? మాతృకయుఁ బుత్రికయుఁ గవలవలె నెక్కడనైన నొక్కటే పోతపోసిన ట్లుందురా ? నేడు యతి లేకుండ నాంధ్రపద్యములను వ్రాయుమను నాచార్యులు గారు రేపు సంస్కృతపద్ధతులన్నియుఁ బూర్తిగాఁ దెలుఁగునఁ బ్రవేశపెట్టుదురు.

ఒక సంస్కృతశ్లోకమున 'రామైవ' యనుటకు 'రామ' యనునది యొక చోటను 'ఇవ' యనునది దానికి దూరముగ నెచ్చటనో మఱియొకచోటను ఉండును. అట్లే తెలుఁగు పద్యములలోఁగూడ 'రామునివలె' ననుటకు 'రాముని' యనునది యొకచోటను, 'వలె' యను ప్రత్యయము దానికి దూరముగ నెచ్చటనో వ్రాసిన యెడల నా పద్య మెట్లుగింజుకొన్న నర్థముకాక 'పులినిఁ జూచి వాతబెట్టుకొన్న నక్క పుచ్చిచచ్చె' నను సామెత జ్ఞప్తికి వచ్చునట్లు చేయదా !

పోనీ వాదమునకొఱకు సంస్కృతములోనుండి తెచ్చిన వృత్తములలో యతి తీసి వేయుదమని యొప్పుకొన్నను, మిగిలిన సీసపద్యము, గీతపద్యము, కందపద్యము, ఆటవెలఁదులలో యతి నిషేధింపవలెనని యెట్లు చెప్పనగును? అయినను శ్రీయాచార్యుల వారీయభిప్రాయమునే కందపద్యములో యతిప్రాసలను విసర్జించి యెందులకు వ్రాయవలెను? మన తెలుఁగు కవులగు తిక్కనాదులు పూర్వులును, విద్వద్వర్యులునుగదా; వారు కందపద్యములలో యతిప్రాసలను బెట్టిరికదా? 'ఆ త్రోవ భగ్న మొనరించి' మన శతావధానిగా 'రీ భావవిహీనంపు పథము త్రొక్కఁదగునా?' ఇఁక నాలవ విషయమునకు వత్తము.

(4) ఈ యతిప్రాసలవలననే యాంధ్రవాఙ్మయమంతయుఁ జెంటయైనదని 'యతుల ప్రాసల లాభ మీ వెంట గాదె' యని యిదవపద్యమునఁ జెప్ప సాహసించిరి. యతిప్రాసలతో వ్రాయఁబడిన పంచమవేదమని యెన్నఁబడు మహాభారతము వీరి కంటికిఁ జెంటక్రిందఁ గానఁబడినదా? హరిహరీ! ఎంతమాట వింటిమి, సముద్రములో నీరు లేదన్న వానితో వాద మెందులకు? మతి తాము సర్వజ్ఞులమనియుఁ దాము వ్రాసినదియే గొప్పయనియును, మిగిలినవారు వ్రాసినది తుక్కనియును వారియభిప్రాయము కాఁబోలును. వారు భావసంతతను నియమరహితముగ, స్వేచ్ఛానుసారముగ, మాదిగ మంచమును జేసిన విషయము గమనింపక 'మగనిఁగొట్టి మొగసాల నెక్కిన' దన్నట్లు పూర్వ కవుల యాంధ్రపద్యములన్నియు 'వ్యర్థశబ్దముల' ప్రోగని వ్రాయుచ్చుటకు వీరు సాహసించుచున్నారే? ఇంకఁ జివరి విషయమునకు వత్తము.

(5) ఈ యైదవ పద్యమును మన యాచార్యులు గారతి చిత్రముగ నల్లినారు. వ్రాసిన విషయము వారికిఁ దెలిసినచో సంతోషమే కాని, పైవారికిఁ జూచిన యెడల నీ పద్యము వారి వాదమునకు స్వయంవిఘాతముగా నున్నట్లు కనఁబడుచున్నదేల? యతి 'వాగింద్రియ విశ్రాంతిని, పద్యార్థసుబోధతను, శ్రావ్యత్వమును' గూర్చునని వారే సెలవిచ్చుచున్నారు అట్టి యతిని గోల్పోవుట ఆంధ్రుల పద్యాల భాగ్యహతియే కాదా' యని వ్రాసిరి. అవును. మన యాంధ్రపద్యమున నుండు యతి నిషేధింపఁబడుట తద్భాగ్యహతియే. ఇందులకు మే మొప్పుకొనుచున్నాము.

బహుశః శ్రీయాచార్యులవారు సంస్కృత యతివలె, మన యాంధ్రయతి యుండవలెనని కాఁబోలు తలఁచి యా భావమును స్పష్టీకరించుటకీ పద్యమును వ్రాసి యుండవచ్చునేమో! 'పద్యార్థసుబోధత' మన యాచార్యులవారికి నాంధ్రపద్యములలోకంటె, సంస్కృత శ్లోకములలో నెక్కువ యుండవచ్చును. కాని, మన యాంధ్రకవిత్వములో నన్న యతితోఁ గూడిన మహాభారతమునకుఁ బద్యార్థసుబోధత

లేదా ? అది యర్థముగాక మనమందఱము తల బ్రద్దలుగొట్టుకొనుచున్నామా ! మఱి కాళిదాస విరచితములగు మేఘసందేశాది కావ్యములలో నక్షరసామ్యముండు నాంధ్ర యతి లేనంతమాత్రమున, నవి యన్నియు జారుజారుగా, సులభముగాఁ, జదివియు జదువనంతలోనే తత్క్షణము నవగాహనమై పోవుచున్నవా ? కావునఁ బూర్వము నుండియు నాంధ్రకవులు వాడుచున్న శ్రవణేంద్రియ సుఖదాయకమైన యతిని నేడు శ్రీయాచార్యులవారు పంచబంగాళము చేయఁదలఁచుట యెంతమాత్రమును సమంజసముగా లేదని మా నిశ్చితాభిప్రాయము. ప్రాసనుగూర్చి శతావధానిగారు "వళుల ప్రాసల లాభ మీ పెంటగాదె" యనుచోటఁ దక్క తక్కిన చోట్ల నొక్క వాదరయుతముగా ఖండింపలేదు కావున, దానిఁ గూర్చి మేముఁ గూడ నేమియు విమర్శింపలేదు. ఇది యంతయు మేము వ్రాసినందువలన శతావధానిగారు మాపైఁ గినియక సాంతముగ దీనినిఁ జదివి మమ్ము క్షమింపఁ బ్రార్థితులము.

---

# పల్నాటి భక్తసమాజ తృతీయ సమావేశము.

---

స్వస్తిశ్రీ క్షయనామసంవత్సర మార్గశిర బ ౧౦ బుధవారము పల్నాటి భక్తసమాజ తృతీయసమావేశము చిన్న అగ్రహారములో ప్రారంభించి శ్రీరాధాకృష్ణస్వామివారిని ప్రతిష్ఠింపజేసి శ్రీస్వామివారి పూజచేసి పిమ్మట ఘటం సీతారామావధానిగారు మున్నగు సంఘ సభ్యులు ప్రేక్షకులు భక్తిపరవశులై నమక పురుషసూక్త నామ పారాయణంబుల నొనర్చి కృతకృత్యతంగాంచిరి. పిమ్మట శ్రీ పిరాట్ల శ్రీశైల శాస్త్రిగారు శ్రీ భేతసభొట్ల వెంకటకృష్ణ శాస్త్రిగారు మున్నగు మహాత్ములు అష్టపదీ తరంగ అధ్యాత్మగానములచే ప్రజల సంతసింపచేసిరి. తరువాత కార్యదర్శినైన నా ప్రారంభోపన్యాసమును వచించి కార్యక్రమమును వెల్లడించితిని. తరువాత సంఘాధ్యక్షులగు శ్రీ కంభంపాటి సీతారామశాస్త్రిగారు వేదాంతోపన్యాసమును వచించిరి. భోజనానంతరమున శ్రీ ఘటం మాణిక్యశాస్త్రిగారు - భాగవతపురాణ

మును జనహృద్యముగునట్లు వచించిరి. సంధ్యావందనానంతరము జిల్లా సంఘసభ్యులును భక్తవర్యులగు గుడ్లవల్లి విశ్వనాధంగారు జానకీ శపథంబను హరికథను గానముచేసిరి. శ్రీ స్వామివారి పూజామహోత్సవంబును మంగళపాఠమును జరిగినపిమ్మట గోవిందనామ సంకీర్తనలచే సాయంత్ర భోజనంబునొనర్చి విశ్రమించి వేకువఝామున శ్రీ స్వామివారి సన్నిధియందు ప్రభాతసేవయు నొనర్చి కృతకృత్యులైరి. ఇట్లు మొదటిరోజు కార్యక్రమము ముగిసెను. రెండవరోజు ఉదయము రుద్రాభిషేకము పురుషసూక్త నామపారాయణములు శ్రీ నారాయణంభొట్ల సీతారామశాస్త్రిగారి అతిమధురమగు భాగవత పురాణము శ్రీ ధూళిపాళ్ళ సుబ్బయ్యగారి సంగీతకాలక్షేపణయు భక్త జనులకు మహదానందంబొసంగెను. భోజనానంతరము శ్రీ దీపాల అచ్చయ్యగారిచే సీతాకళ్యాణమను హరికథాసుధారసము సభారంగంబున సాయంత్రి 6 ఘంటలవరకు వెదజల్లబడియె. పిమ్మట సంధ్యావందనానంతరము భక్తవర్యులును జిల్లాసంఘసభ్యులగు అంబటిపూడి రామనాధంగారు పాండవదూర్వాసమను హరికథను వచించి సర్వజనులను ఆనందాతిశయమున చిత్తరువులోని బొమ్మలపోల్కి నొనర్చెను. సాయంత్రభోజనానంతరమున వెంపటి వీరరాఘవయ్యగారు అహల్యాశాపవిమోచనమను హరికధను వచించిరి. ప్రభాతసేవయు జరుపబడియె. మూడవరోజు శృతినామపారాయణయు తరంగ అష్టపది అధ్యాత్మ కాలక్షేపణయు శ్రీ లంక బుచ్చయ్యశాస్త్రిగారి అతిభక్తి పూరితంబు అగు కృష్ణరాయబార కథాసహితంబగు పురాణమున్నూ శ్రీ జిల్లాసంఘసభ్యులగు పాలపర్తి శివరామయ్యగారి ఆనందదాయకంబగు సంగీత కాలక్షేపణలతో భోజనసమయంబయ్యెను. భోజనానంతరంబున శ్రీ గోలి మల్లిఖార్జనశాస్త్రిగారి ధర్మశాస్త్ర విచారణయు వారి శిష్యులగు బాలకుల భజనయు శ్రీ పరమహంసేత్యాది బిరుదాంకితులగు శ్రీ ఎనమండ్ర లక్ష్మీనారాయణ స్వామివారి వేదాంతోప

న్యాసమున్నూ జరిగెను. సంధ్యావందనానంతరము మంగళగిరి హరిదాసుగారి హరికథయు జరుగబడియె. పిమ్మట కార్యదర్శినైన నేను సభాంతంబున సర్వవిషయములను గూర్చి ఉపన్యసించుటయు ఆహ్వాన సంఘపక్షమున శ్రీ లంక సాంబశివశాస్త్రిగారు గంభీరోపన్యాసము నిచ్చుటయు అన్ని సమయములయందును ఆయా కార్యక్రమముల యందు బ్రహ్మశ్రీ మొదలి సుబ్బయ్యగారు మృదంగవాద్యమును సకలజనహృద్యమగునటుల నొనర్చి శ్రీ రాధాకృష్ణస్వామివారి అనుగ్రహపాత్రులై జిల్లాసంఘసభ్యులయ్యును యీ సంఘమందు సభ్యత్వమును వహించి మృదంగవాద్యమందు లోపములేకుండా యీ సమావేశములను ఉద్ధరించుచున్నందులకు కార్యదర్శినైన నేను వందనశతకంబుల నొనర్చుచున్నవాడ. పిమ్మట మూడవరోజు రాత్రి ప్రభాత సమయంబున సభ్యులందరు దయచేసి సర్వవిధములగు ఉపచారంబుల శ్రీ స్వామివారి ప్రబోధించి మంగళహారతిని యిచ్చి శలవొంది కరతాళంబుల హార్మణి మృదంగ వాద్యంబుల నామ సంకీర్తనంబులు చేయుచు నిజనివాసంబులకు జనుట మున్నగు కార్యక్రమములచే తృతీయ సమావేశము అగ్రహారనిలయులగు ప్రజల అదృష్టంబున జయప్రదముగా కొనసాగెను. ఈ సంఘమును పిలిపించి ప్రియ ప్రయాసల కోర్చి తాము తరించి ప్రజల తరింపజేసిన శ్రీ వెంపటి సుబ్బయ్య లంక సుబ్బయ్య యీ వెంకటనారాయణగార్లకు ఆయురారోగ్య పుత్రపౌత్ర అభివృద్ధియు దేహాంతంబున మోక్షంబును శ్రీ రాధాకృష్ణస్వామివారు ప్రసాదించుగాక. ఈ సంఘమునకు 32 ముప్పై యిద్దరు సభ్యులు దయచేసి యీ కార్యక్రమము నొనర్చినందులకు నే నెంతయు కృతజ్ఞుడను. తిరిగి భక్తసమాజ చతుర్థసమావేశము వాడపల్లి గ్రామమునకు శ్రీ తిరుపతి రామయ్య రామడుగు రామకృష్ణయ్య గార్లచే పిలువం బడియె.

# కళావంతుల సంఘసంస్కరణము.

1 కళావంతుల సంఘసంస్కరణమును గురించి ఆంధ్ర కృష్ణా పత్రికలు విశేషముగా ప్రచారము చేయుచున్నవి. కళావంతుల సంఘముయొక్క అన్నిరకములైన అభివృద్ధులను మేము హృదయపూర్వకముగా నభిలషించుచున్నాము. కాని వారు నిర్ణయించుచున్న కార్యక్రమమునందుమాత్రము కొన్ని సవరణలు అవసరమనిమాత్రము మా అభిప్రాయము. ఈ పరిస్థితులు ఒకటి రెండు యింకా యెక్కువమంది ఆంధ్రపత్రికాధిపతులకు తెలిపిననూ వారు ప్రచురించుట కనుగ్రహింపలేదు. దానిచేత మాకును వారికిని ప్రకృతవిషయమును గురించి భిన్నాభిప్రాయముండునని అనుకోవలసివచ్చినది. తమ అభిప్రాయమునకు విరుద్ధమైనను వివిధపక్షముల ఉద్దేశ్యమును లోకమున కెరుకపరిచి సిద్ధాంతీకరింపవలసిన భారము వారియందున్ననూ దానిని వారు గమనింపనందులకు పశ్చాత్తాపపడవలసియున్నది. యేవిధముగానయిననూ దీనిని గురించిన సత్యాన్వేషణ మవసరము గనుక అభినవసరస్వత్యనుగ్రహముతో నిట్లు తెలుపుచుందును.

2 ఏ సంఘమునైనను ఔన్నత్యముకు దీసికొనిరావలయునన్న ఆ యా సంఘమునకుండు నాయకుడు చెప్పినట్లొప్పున ఆచరించువాడై సత్ప్రవర్తకుడైయుండి స్వేతరులనుసైతము ఆచరింపజేయవలెను. తానపమార్గ ప్రవర్తకుడై పరుల నాచరింపజేయుదమన్న నయ్యది కొనసాగనేరదు. సాంఘికౌన్నత్య మెన్నడును కలుగదు. యిట్లుండ వేశ్యా

సంఘమువారు వ్యభిచారవృత్తిని కులవృత్తినిగా మార్పించుకొను చున్నామనియు సంఘగౌరవమును నిలువబెట్టుకొనియెదమనియు వాగ్రూపమున జెప్పుచూ ఆచరణలో నించుకైననూ జూపకయు మా యాత్మగౌరవములు కాపాడుకొనుటకు ఆటంకకరములైనవి దేవాలయములలో నృత్యగీతనౌకరులేయని వ్రాయుచుండిరి. మీరుమిక్కిలి భజనల నంగీకరించి యీనాములను మా స్వేచ్ఛానుసారముగా ననుభవించులాగున్న దొరతనమువారిచే నొక చట్టమును నేర్పాటు చేయించిన బాగుండునని గొప్ప యాందోళనము చేయుచు పలుగురు ప్లీడర్లను కొందరి స్కూలుమాస్టర్లను కొందర సహాయోద్యమ నాయకులను రేయింబవళ్ళాశ్రయించి కొన్ని వ్యాసముల నాంధ్రాది పత్రికలలో బ్రకటించియున్నారు. అరయనరయ నివి ఆశ్రయించిన కారణమువల్లనో లేక ప్రచురించునంశములు లోకహితముగానుండు ననియో వారు ప్రకటించియుందురు, కాని లోకములో నేయంశ మైననూ తనకు హృదయపూర్వకముగా నింద్యమనితోచినప్పుడు ఆపనిని విసర్జించుట న్యాయము. కాని దానిఫలము నపేక్షింపకూడదు. పూర్వము జమీందారులవల్ల నాట్యకుంభారతులు వగైరాలకు యివ్వ బడిన యీనాంభూములు లాకృత్యముల నిర్వర్తింపకయె తాను స్వేచ్ఛగా ననుభవింపకోరుట వెర్రితనము. ప్లీడరువృత్తిలో పాపమున్నదని గ్రహించినప్పు డాపనిని విసర్జించుటయె ముఖ్యకర్తవ్యముకాని దానిని స్కూలుమాష్టరుపదవిగా మార్పించవలెనసికోరుట హాస్యాస్పదము ! పురోహితమువల్లజీవించువా డావృత్తి గర్హ్యమైనదిగాన పీఠమ పుచ్చు కొనుచున్న జడ్జిపదవిగా మార్పగోరుట నింద్యము. ప్రతివిషయము లోనుకొంత త్యాగ మవసరముయున్నది. ఆసహాయోద్యమములో

తమ ఉద్యోగవృత్తి త్యాగమెగాక ధనత్యాగమెగాక ప్రాణములుసైత మర్పించతగిన త్యాగు లుండియున్నారు. గనుకనే ఆయుద్యమపవిత్రత కొందరు గ్రహింపగలిగిరి. ఏపనిలోనైనను త్యాగము లేనిది, తనయభీష్టము నెరవేరజాలదు. పూర్వము పడుచులుగానున్నవారు తమవ్యభిచారదుర్వృత్తులను మాని బ్రహ్మచారిణులైయుండి సన్మార్గమునందుండులాగున ముందు సంస్కరింపబడవలెను. యిదివరలో పడుచులుగానున్నవారలు వివాహముచేసుకొన వీలులేనందున భక్తిభావపూరితములగు అధ్యాత్మము మొదలగువాటిని పాడుచు భగవత్సేవచేయుచు వేషభాషలు మార్చుకొని ప్రవర్తన మార్చుకొని భగవత్సేవచేసినమాత్రాన వారిజీవితము కళంకదాయకము కాజాలదు. ఇంక ననాథబాలికలనీసంఘమువారు సేకరింపకయు, వివాహయోగ్యలగుబాలికలకు గజ్జకట్టించకయు, తమసంఘమును బాగుజేసుకొనుట యుక్తముకాగా నృత్యముచేయతగినవారిని యితరప్రవర్తనలు మాన్పించలేక భగవంతునివద్ద ఆడుటవల్ల ముప్పువాటిల్లినదనుట యెంతవరకు సమ్మదగినదో చదువరులు గ్రహింతురుగాక. లేక నిజముగా మేము పవిత్రులమయ్యు మా కీయపర్థకము దేవాలయనృత్యాదులవల్లనె వచ్చినదని సత్యముగా గ్రహించినప్పుడు వా రేల యీగర్హ్యజీవనము నాశ్రయించవలెను? నిరాధారులుగానున్నవారు కూలినాలిచే నెంతమంది జీవించుచున్నారు? ఆడువాం డ్రేల మహాత్ముని యుపదేశానుసారముగా రాట్నములుత్రిప్పి నూలువడ్కి నాపనులు చేసుకొని జీవించగూడదు? అరయనరయ వీరి యభిప్రాయ మెట్లున్నదనిన మాపూర్వపుపడుచులు స్వైరిణులైయుండవలెను. దేవళములలో నాట్యము ముందుగా మానుకొనవలయును. యీనాము లనుభవించవలెను. అనుతలంపె గాని తమసంఘాభివృద్ధికి

పాటుపడుదమన్న తలంపు, కనుపించదు. వీరు సూచించునవి రెండంశ ములు. అనాథ బాలికలను సంఘములోనికి రానీయకుండుట; బాలిక లకు వివాహము చేయుట. ఈ రెండును వేశ్యాసంఘమువారి చేతులో నున్నవి. దీని కితరసహాయ మెంతమాత్ర మవసరపడదు. కాన వీరు చేయదగిన అంశమేమన, తమయీనాములను ఆ ధర్మకర్తలు నియ మించు నవుకరీకి ఒడబడు యితరస్త్రీలకు తక్షణం వదలివేసి కూలి నాలి చేసికొని మరియొక స్వతంత్రజీవనము చేసికొనుట తగవుగాని దాతల ఉద్దేశ్యమునకు భిన్నముగా దీనిని తాంబూలము వేయ ప్రయ త్నించుట సమంజసము కాదు. భజనచేయు సమర్థులు పెక్కండ్రు పెక్కు జాతులలో యున్నందున యితరు లేల భజనచేసి యీనాము లనుభ వింపకూడ దనుసంశయము నిరవధికమగునుగాన సర్వవిధముల దీని యందు చెడుగున్నదని తోచినప్పుడు దానిని మనము వదలుకొనుటయే యుచితము. కాయగాని పండుగాని కుళ్ళుపుట్టినప్పుడు కుళ్లువదలి మంచి భాగ మనుభవించ ప్రయత్నించుటయు అనారోగ్యమే. మంచిభాగము లోను యీ చెడిపోయినపదార్థ మావరించియుండును. కాన దీనిని వదలి మీ కులమును ఔన్నత్యములోనికి దెచ్చుకొనుట సర్వశ్రేయము.

☞ ప్రముఖుల కొక్కమనవి.

ముఖప్రీతిమాటలకు మోసపోయి వారిమాటలకు మోమాట పడి ఆంధ్రపత్రికాది దేశపత్రికలలో తమవ్యాసరాజములను ప్రకటింప కుండుడు.

19

# పుత్రోత్సవము

"రామసింగు" అను నొక యుదారపురుషుని ౧౩ సంవత్సరములు పోషకుల లోను బడపడి ౬ వత్సరముల నుండి ప్రధానపోషకులలోను మా పత్రికాపాఠకు లెల్లరుం బ్రతిమాసము తిలకించుచునే యున్న వారలు. ఇంకను నాయన యీ పత్రికకుఁ గావించిన మహోపకారముగూడ నొకపరి విశేషించి వీక్షించియున్న వారు. అట్టి వారియెడలఁ గృతజ్ఞత కనఁబఱచుట మాకు విధియైయుండుటంబట్టి తదుదంత మొకింత యిచటఁ బ్రకటించుచున్న వాఁడను. ఈయన ప్రాయము సుమారు ౭౦ సంవత్సరములు. నలుగు రైదుగురు పుత్రికలు. అం దొక పుత్రిక పుత్రపుత్రికా సంతానవతిగూడ నైయున్నది. ఇట్లు దుహితలును దౌహిత్రులును మఱఁదులు మున్నగు మఱికొందఱు బంధుగులును దత్సంతతియును సర్వదా తన్నుఁ జుట్టుకొనియుండ బంధుసంకీర్ణమందిరతం బ్రమోదభరితుఁడై యున్నను "అపుత్రస్య గతిర్నాస్తి" యను నభియుక్తోక్తి దలంచుకొని గంభీరుఁడగుటచే బహిష్కరింపకున్నను నెప్పుడేని యీ యాశ్రితము నెఱవేర్ప నీశ్వరుని ధ్యానించుచుండెఁబోలు. భగవద్భక్తుఁడును సర్వభూతహితరతుఁడును విశేషించి విద్వద్బ్రాహ్మణ పూజకుఁడును నగు నిట్టివాని యాశ్రితం బీశ్వరుఁ డేల పూరింపకుండును. కనుకనే యీ ప్రభవ సం॥ శ్రావణబహుళ దశమీ సోమవాసరము రాత్రి నాలుగునర గంటలకుఁ గర్కాటకలగ్నంబున శ్రీరామసింహునకుఁ బుత్రోదయం బగుటయుఁ దదుత్సవము ౨౧ దినమగు భాద్రపద బ ౧ కావింపఁబడియె. ఈయన ప్రతి సం॥ భాద్రపద శు ౧౪ అనంతపద్మనాభవ్రతమును మఱునాఁడు సత్యనారాయణ వ్రతమును జేయుచుండును. అప్పుడు పలుమంది విద్వద్బ్రాహ్మణులును నటవిటగాయకులును బంధువులును స్నేహితులును జనుదెంతురు. ఆ రెండుదినములు నందఱికి నన్నదానమును గావించియు హరికథలు చెప్పించియు నవధానములుచేయించియుఁ బాటలుపాడించియు నాటలాడించియు మహోత్సవమొనర్చి తత్తదధికారానుగుణముగా సత్కరించుచుఁ దనకు దేవబ్రాహ్మణులయెడఁగల భక్తివిశ్వాసములఁ బ్రకటించుటయే కాక విద్యాభిమానముగూడఁ జూపుచుండును. వేలరూపాయలు వెచ్చించి యనేకులకు వివాహములే చేయించెడి యీ మహోదారుఁ డొనర్చు విద్వత్సన్మానము లెంత విరివిగా నుండునో చదువరులు గ్రహింపకపోరు. భారతీయవిద్య లాదరించు స్వదేశప్రభువులు విశేషించిలేని మన దేశమున నిట్టి మహాపురుషులు విద్యాభివృద్ధికిఁ గొంత తోడ్పడుచుండుట యెంతయు ముదావహము. ఇట్లేటేట నీయన భాద్రపద శుద్ధ చతుర్దశీ పౌర్ణమాస్యలయందుఁ జేయు ననంతపద్మనాభ సత్యనారాయణవ్రత మహోత్సవముల కా మఱునాఁడు పుత్రోత్సవముగూడఁ దోడయి పలుమందికిఁ బరమానంద మొదగూర్చెను. అనేకాబ్దములనుండి యారాధింపఁబడు ననంతపద్మనాభ సత్యనారా

యును లాత్మోత్సవముతోపాటాయనచే నాత్మజోత్సవముగూడఁ జేయించి యత్యంత స్తుత్యులైరి. కం॥ అక్కఱకు రాని చుట్టము, మ్రొక్కిన వరమీని వేల్పు, మోహర మునఁ దా నెక్కినఁ బాఱని గుఱ్ఱముఁ గ్రక్కున విడువంగవలయుఁ గదరా సుమతీ॥ అని జను లేర్పఱచుకొన్న కట్టుబాటునకు భగవంతుఁడు గూడ భయపడి తీరును.

రామసింహు పుత్రోత్సవమునకు వ్రతోత్సవములకుంబోలె బంధుగులు పండితులు పాఠకులు మొదలైనవారే కాక దేశముఖులు దేశపాండ్యాలు జాగీరుదారులు రాజకీయోన్నతోద్యోగులు పలుమంది యరుదెంచి కట్నములు చదివించి కానుకలర్పించి శిశువును దీవించి జనకునిచే సత్కృతులయిరి. వ్రతోత్సవములకున్న వార్షిక పరిధానమున నే కాక విచ్చేసిన విద్వాంసులు నూత్న వసనములచేతను సాలులచేతను జాల సన్మానింపఁబడిరి. ఆయుత్సవమున కరుదెంచిన యందఱు నాశీర్వచించుతఱి నే నీ దిగువనుండు పద్యములం బఠించితిని.

మ॥ పరిభవశ్రావణ కృష్ణపక్షదశమీ పద్మారివారంబునన్
శుభయుక్తంబగు నార్ద్రయందు మఱియున్ శుభ్రాంశులగ్నంబునన్
బుధరక్షోగురు లబ్జబాగ్నిగులుగా సేనింతు నాయుఃప్రదం
డభయంబీయఁగ రామసింహుతనయుం డావిర్భవించెంగదే ౧

కం॥ వచ్చిన బ్రాహ్మణులెల్లరుఁ బొచ్చెము లేకుండ నీ సుపుత్రున కాశీ
స్సిచ్చుచను టర్హమగుటను దెచ్చితిఁ బద్యమయమైన దీవన నేనున్, ౨

కం॥ రవిశశికుజబుధగురులును, గవిశనిరాహువులుఁ గేతుఁ గలసి మహావై
భవసమవేతుని దీర్ఘాయువుఁ జేయుదురుగాక యీత దుత్తమశిశువున్. ౩

సీ॥ దక్షవసిష్ఠాది తనయులం గాంచిన యజుఁ డీనిసుంగుల నాయువిడుత.
మనుధర్మముఖులకున్ జనకుఁడౌ భాస్కరుఁ డారోగ్యమిడుత మీ యర్భకునకు-
గజముఖస్కందులం గని పెంచిన యుమేశుఁ డైశ్వర్యమిడుత మీ యాత్మజునకు-
కంతున కెనయౌ జయంతుని తండ్రి యీ పట్టికి సామ్రాజ్యపదవి నిడుత-
భార్గవుఁడు నీతి మఱియు వాక్పటుత వాణి యశము లక్ష్మీశుఁడును నిచ్చి యనఘుఁడైన
రామసింహుతనూభవుం బ్రేమతోడ నోముదురుగాక ప్రాభవం బుట్టిపడఁగ- ౪

కం॥ మఘవద్వైభవయుతుఁడు ననఘుఁడౌ మా రామసింహు నవనందనుఁడౌ
రఘునందనుఁ డా శ్రీమద్రఘునందనుచేతఁ జక్క రక్షితుఁడగుతన్- ౫

సీ॥ దేశముఖ్ దేశాయి దేశపాండ్యాల్లోకుఁ గట్నంబు లెన్నొ యీఁగల్గినారు.
కనకభూషలచేతఁ గై సేయఁగాఁగల్గి రోగిని జాగీర్దారు లొక్కమొగిని-
మఱియుఁ గొందఱు సువ్రాహ్మణులు తా మరుదెంచి యర్పింపఁగంగల్గి రంశుకముల
గాయకు లమ్మధురంబుగాఁ బాడఁగలిగిరి. యాడఁగల్గిరి వేశ్య లభినయములఁ
గాన నెవియుఁ జేతగామి విద్వత్కవినైన నేను నీకు నభినవముగ
రత్నపంచకంబు రచియించియిచ్చితి రమణమై గ్రహింపరా కుమార! ౬

## —• నాగరపరీక్షానిర్ణయము •—

తే॥ పుడమివేల్పు లెల్లరు బుద్ధిశాలురై రహించెడి యల భర్తృయజ్ఞుఁగూర్చి
దోయిలిఘటించి కరము సంస్తుతులొనర్చి కట్టువినయంబుదోఁపఁగా మిట్టులనిరి

ఉ॥ "శోధితుఁడైన నాగరుఁడె సోమసుధాపగఁ గన్యసీయ శ్రా
ద్ధాధికృతుం బొనర్పను సమర్థులటంటిరి. కులంబు గోత్రముల్
బోధయొనర్పఁజాలరి ప్రబుద్ధుల మున్నగువారిపట్ల నా
శోధన మేవిధింబొసఁగుఁ జూచి వచింపఁగదే మహామతీ!" ౩౩౫

చం॥ అని యిటు ప్రశ్న సేయుటయు నా ద్విజులంగని భర్తృయజ్ఞుఁ డి
ట్లనియెను "బ్రహ్మరూపపు మహాధర మీరలు నాదుశిక్షణం
దునిచితి. కాని గాక, నళినోద్భవుఁ గూరిచి కేలుమోడ్చి మీ
మనములఁ బట్టునట్టులు సమస్తము చెప్పెద నాలకింపుఁడీ. ౩౩౬

మాలిని॥ "అవిదితపితృవంశుం డన్యదేశాగతుండున్
సవినయముగ మీతో నాగరుం డేనటన్నన్
దవుగతిఁ బరిశుద్ధిన్ గల్పి పంపుండు గర్తా
భవసహితులకై యా బ్రాహ్మణశ్రేష్ఠులారా! ౩౩౭

సీ॥ అధికమౌదక్షిణ యార్జించుటకుఁ గాను బిఱుసువాలెడి కోర్కె పేర్మిఁగాని
యపకృష్టుమీఁదికిం గృపణతం బరువెత్తు స్వార్థమౌ లోపంబువలనఁగాని
యెదొయొక్క యత్యల్పహేతువుం జేసి యుదితమౌ ద్వేషంబునుండి కాని
శుద్ధియిచ్చినపైని చ్యుతిగల్గునని మదిం బీఁటవెట్టినయట్టి భీతిఁగాని
పాచితంబును యాచించు పతితజనుని శుద్ధుఁజేసిన నాగరశ్రేణివరుల
బ్రహ్మహత్యోద్భవంబగు పాపమెనయుఁ. గాన నెటువంటివారికిం గార్య మద్ది.

ఆ॥ అస్మదుక్తమైనయట్టి ముత్తెఱఁగులశుద్ధి వడయునెవఁడు శ్రద్ధతోడ
వాఁడు దూరదేశవాసియే యగుఁ గాక నాగరునిగ నెఱుఁగనాఁ గులమున. ౩౩౯

కం॥ మును జనయితృవంశంబును జనయిత్రివంశ మవల సంశోధితముల్
బొనరిచి శీలంబును నటు వెనుకను శోధింపఁదగు వివేకముతోడన్. ౩౪౦

కం॥ ఈ మూఁడింటను శుద్ధుఁడు సామాన్యపదార్థుఁడగును. సకలద్విజులున్
నేమమున నేటికొకపరి తాముసు శుద్ధులగుటాప్త స్థానం బటు కాన్. ౩౪౧

ఆ॥ అందుకొఱకుఁ బూర్వ మద్దాంతమున శుభబుతువునందునను జితేంద్రియులయి
శాంతి దాంతి గలిగి చాతుశ్చరణసంపదన్వితులయియున్న యవనిసురుల ౩౪౨

ఆ॥ వారిమధ్యమందు వాసి గర్తాతీర్థ వాసి భూసురుని భక్తిఁ గూరు
చుండఁబెట్టి నాలు గుత్తమపీఠికల్ వారియెదుట వేయవలయు సరిగ. ౩౮౩
సీ॥ ప్రథమపీఠం బందు బహ్వృచుకౌఆకును. నన్యమౌపీఠంబు యాజుషునకు.
మఱి తృతీయంబు సామగునినిమిత్తము తరువాతి దాద్యుండు తావసింప
వేఱొక్కపీఠంబు వేయనౌ నచ్చోటు ముద్రికార్థము విప్రముఖ్యులార!
శ్రీసూక్త శాకున శ్రీవిష్ణుదైవత పారావతంబులు పావమాన
జీవసూక్తములును జెప్పనౌ బహ్వృచుఁ డపుడు శాంతికముగ. నటు చతుఃప్ర
కారమైన ఋషులకల్పంబు మండలబ్రాహ్మణంబును మధుబ్రాహ్మణంబు ౩౮౪
కం॥ గాయత్రీబ్రాహ్మణమును శ్రేయస్కర పురుషసూక్త శివసంకల్పా
లా యంగపంచకంబును బాయని రుద్రములు నిష్ఠఁ బఠియించి వెసఁ ౩౮౫
సీ॥ అధ్వర్యుఁ డొనరించునది శాంతికంబును. ఛందోగుఁడును బేర్మి సౌవ్రతంబు
దేవవ్రతంబును దినమణి చంద్రమోవ్రతములు విష్ణుసంహితయును జ్యేష్ఠ
సామము నేకవింశతిదాఁకనౌ రథంతరమును గాయత్రి మఱియువినుఁడు
భారుండసామసంపన్నంబులౌ సామరుద్రము ల్చదువనౌ యాషముగను.
స్కందసూక్తమును బ్రశస్త గర్భోపనిషత్తు నీలరుద్రసహిత ప్రాణ
రుద్రములు మఱి నవరుద్రముల్ క్షురిక నాద్యుఁడు పఠింపవలయు యుక్తఫణితి.
తే॥ అంతఁ బుణ్యాహఘోష గీతాదికములు సెలఁగ శ్వేతాంబరంబులు లలి ధరించి
శ్వేతగంధము మెయిఁబూసి శ్వేతపుష్పమాల మెడవైచి యాఢరామరులకడకు
మ॥ చని కేల్మోడిచి శుద్ధికాముజనుఁ "దీక్షాదేవులౌ నీవు ప్రా
ర్థనముం జేయుము నానిమిత్తము మహాత్మా! శుద్ధిగావింత్రు వా"
రని యమ్మధ్యగుఁ గూర్చి పల్కనగు న స్థానంబు గోచర్మముల్
దన కాయంబునఁ దాల్చి యివ్విధమునం దా వేడనౌ వారలఁ. ౩౮౭
కం॥ "ఏతన్నాగరభూసురుఁ డేతెంచినవాఁడు శుద్ధినీప్సించి. భవ
చ్చేతమునకు రుచియించినఁ బ్రీతి నొసంగుండు శుద్ధి పృథివీదేవుల్!" ౩౮౮
చం॥ అనియిటు ప్రార్థ్యమానులయి యమ్మహిదేవులు వేదసూక్తవా
చనమున శుద్ధుసల్పుటయొ సల్పకయుంటయొ చెప్పనౌను వా
క్కున నది శుద్ధికాముజనుఁ గూర్చి వచింపఁగరా. దదఃప్రకా
రనియతి నేనచేసితిని బ్రాహ్మణు! లింకను నాలకింపుఁడీ. ౩౯౦
ఆ॥ అంత శుద్ధికాముఁ డధ్వర్యు ఛాందోగ్యు నాద్యు నన్యుఁ జూచునది క్రమముగ.
వారు మదిని దృష్టివఱినచో సూక్తముల్ సౌమ్యములును భద్రసంయుతములు ౩౯౧

సీ॥ మాంగల్యజనకముల్ మంత్రలింగములును వృద్ధితుష్టిదములు శ్రేష్ఠములును
నైంద్రవారుణములు నై విరాజిల్లెడి వాక్యము ల్వచియింపవలయు నెలమి.
మనమున సంతృప్తి యొనరకయున్నచో నైరుత్యములును వినాశకరము
లాగ్నేయములు మఱి యామ్యయు ల్కడు రౌద్రములును ననిష్టము ల్పలుకవలయు.
నదిని సంతృప్తిపడిన యమ్మహీసురవర్యు లచట శ్రీతిపాదరతి లేని యజ్ఞుతతికిఁ
బుష్పదానంబు సేయనౌ భూమిదేవవర్యులార! జగద్ధితచర్యులార! ౩౯౨
ఆ॥ తుష్టిపడక యలుకతోడ వర్తించెడివారిసీయుటంచు వదలవలయు.
నెల్లకృత్యములను నీప్రకారంబునఁ జనదు నిర్ణయింపఁ గనుఁడు ద్విజులు! ౩౯౩
తే॥ ప్రాకృతోక్తులచేత నే ప్రజలు చేయుమాడ్కి నిర్ణయమైనపై మధ్యగుండు
చక్కఁ దాళత్రయంబు నొసంగవలయు నందఱికిఁ గూడ నిర్ణయమునకుఁ దెలియ"

## —♦ భర్తృయజ్ఞవాక్యనిర్ణయము ♦—

కం॥ అనవిని బ్రాహ్మణులందఱు మునివరుఁడగు భర్తృయజ్ఞుమునందఱు వినయా
వనతులయి నిల్వఁబడి యిట్లని రదివిను చెప్పెవాఁడ నవనీనాథా! ౩౯౪
తే॥ "మనుజభాషను గాక యామ్నాయభాష భూసురేంద్రులు మధ్యముం బొందియున్న
యెవనికిం దాము నిర్ణయమీయవలయు? నెటు త్రితాళాలమధ్యగుం డేయవలయు?"
ఆ॥ అనుడు భర్తృయజ్ఞుఁ డనియె "బ్రహ్మస్థానమునను గూరుచుండి ఘనులు నాగ
రులు వచించువాక్యములు దబ్బఱలు గావు శుభము గాని లేక యశుభము గాని ౩౯౬
తే॥ అట్లు గావున వేదవాక్యములచేతఁ జూపుచుందురు శుభమో యశుభమొ వార.
లర్థియై వచ్చి ప్రశ్నించునట్టి వాని కో మహీసురులార! యింకేమిగలదు. ౩౯౭
తే॥ కాన మాటికిమాటికిఁ గార్యనిర్ణయంబు గావించువరకును నడుగవలయు
శుద్ధి కామునిమిత్తమై క్షోణిదేవులార! మధ్యస్థుఁ డవహితుండగుచు మిగుల ౩౯౯
తే॥ బ్రహ్మశాలాప్రవిష్టుల భాషితంబు వ్యర్థమైన నశించు మహత్త్వమెల్ల.
దానఁ గ్రోధంబు గలుగు. నద్దాన ద్రోహ. మంతఁ గలుషమ్ము. గాన నిట్లు సుగఁబడెడు
తే॥ అందఱుం గుమిగూడ మధ్యగుఁడు లేచి యిచ్చుఁ దాళత్రయంబు శుద్ధిచ్చువునకుఁ
గామమువార్జించు మొదటిది కడకుఁ ద్రోయుఁ గ్రోధమును రెండవది. లోభగుణము నెల్ల
ఆ॥ పాయఁజేయు మూడవది గాన ముమ్మఱు తాళములను నీయఁదగు" నటంచు
భర్తృయజ్ఞుచేతఁ బలుకంగఁబడుటయు నెలమి ద్విజులు మఱియు నిట్టులనిరి. ౪౦౨
తే॥ "శుమను నాథర్వణ బ్రాహ్మణము చతుర్థముగను గీర్తింపఁబడియెడిఁ బూర్వమందు.
నాగరబ్రాహ్మణుల కది యొగతిం బ్రథమపుఁ బ్రశ్నంబు దానయ్యె యమితులేంద్ర!

కం॥ అనియిటు ప్రశ్నించుటయును విని యమ్ముని "యిచట నీర్ష్యవిడువుం డేత
ద్ధ్వనిమయము నేనచేసితిఁ గని స్వస్థానము విశుద్ధిగలిగి రహింపఁ జే. ౩౬౪
తే॥ ఋగ్యజుస్సామ సంజ్ఞల నెసఁగునట్టి క్రతువులెల్లను బావత్రికములు గాని
దైహికములయి వెలసెడి యాభిచారికములు గావు వినుండు సాగరులు! వీరు
తే॥ సర్వలోకహితార్థమై స్రష్టచేత నాభిచారికమంతయు నార్యులార!
యొగి నథర్వణవేదమం దుక్తమయ్యెఁ గార్యసిద్ధికి నది యగుం గారణంబు. ౩౬౬
కం॥ ఏతద్ధేతువుచేతను భూతలమున నది చతుర్థముగనున్నను సా
చేతం బ్రథమంబుదిగా నీతతిఁ గావింపఁబడె మహీసురులారా!" ౩౬౭
వ॥ అనివాక్రుచ్చెనని విశ్వామిత్రమహర్షి వక్కాణించుటయు సానత్రమహీ
రమణుండు ౩౬౮
తే॥ "ఈవిధంబున శుద్ధ్యర్థమేగుదెంచి సాగరులప్రోలనుండిన సాగరుండు
తానెటు శుద్ధిగాంచునో తత్ప్రకార మానతీయుము వాచంయమాగ్రగణ్య!"
వ॥ అనిప్రశ్నించుటయు నమ్మహాముని యిట్లనియె. ౩౭౦
తే॥ "ఈవిధంబున సముదాయ మేరుపడుడు 'నీదుగోత్రం బెది? నేది నీదుప్రవర?
సాయనమదేమి? రాయమ సాయనయేమి?' రనుచుఁ దచ్ఛుద్ధికాముని నడుగవలయు.
తే॥ అటు సగోత్రప్రవరమగు నతనియన్వయము నెఱింగి యనంతర మతనితల్లి
నామెతల్లిని మఱియును నామెతల్లి శుద్ధికృతియుం దెలియంగనౌ క్షోణిసురులు! ౩౭౧
సీ॥ పితను బితామహుఁ బిత్రుపితామహుఁగూడ నెవరంచుఁ బ్రశ్నించి యెఱుఁగవలయు
మాతఁ బితామహి మఱిఁ బ్రపితామహిం గ్రమముగాఁ దెలిసికోఁ గడఁగవలయు.
మాతామహుని వెండి మాతృపితామహుం దత్ప్రపితామహుం దఱుచవలయు.
మాతామహియు నోజ మాతృపితామహి ప్రపితామహి యెఱుంగఁబడఁగవలయు.
నిటు మహావిటపింబోలి యొదుఁగుచున్న యాలఘు తద్వంశవృక్షముం దెలిసికొనుచుఁ
బ్రీతి సిందూరతిలకముం బెట్టినొసట శుద్ధినీయంగవలెఁజుమీ క్షోణినాథ! ౩౭౩
కం॥ చాతుశ్చరణసుమంత్రవ్రాతంబున దీవనములు వరుసగ నిడి సం
ప్రీతిమెయి నంత మధ్యగుచేతఁ ద్రితాళముల నీయఁజేయఁగవలయుంజే. ౩౭౪
కం॥ పదపడి తద్ద్వారమునన పటయత "నీసాగరుండు సామాన్యపదా
స్పదుఁడయ్యె శుద్ధిఁగని" యని పదుగురునినఁ జెప్పవలయు బాగుగ భూపా! ౩౭౫
తే॥ అవల నగ్నిగృహంబున కరిగి సరవిఁ దృప్తినొందించి మిగుల నాదేవు భక్తిఁ
"బంచవక్త్రేణ" యనుమంత్రపఠనమునననిచ్చి పూర్ణాహుతిని భూసురేంద్రులకును
తే॥ అన్నదానంబు గావించి యంత శక్తికొలఁది దక్షిణ యీయంగవలయు రాజ!
ద్విజులు తమప్రోల సిందూరతిలకకలితు నలిపి పరిశుద్ధుఁ డితఁడంచుఁబలుకుటయును

కం॥ "మావంశము నిల్పంబడె నీవడి" యని తత్పితరులు నెంతయు నాత్మన్
భావించి తృప్తిపడుదురు భూవల్లభ! యపుడె శుద్ధి పూర్తియగుం గా. ౩౭౮

ఉ॥ ఎవ్వఁడు వంశభూమిరుహ మెంతయు శోధితముం బొనర్చి తా
నివ్విధి శుద్ధిఁజేసికొన నెంచఁడొ వానికిఁ దగ్గరీతిగన్
నెవ్వగఁ గూర్పఁగావలయు నేర్పరులౌచు మహీసురాళి యిం
కెవ్వఁడునుం బ్రమత్తుఁడయి యీవిధ ముండకయుండఁ బార్థివా! ౩౭౯

కం॥ అష్టకులోద్భవుఁడైనను స్పష్టంబుగ నివ్విధముగ సంశోధితుఁడే
యష్టవ్యుఁడు శ్రాద్ధమున. నశిష్టునియెడ నింక నేమి చెప్పఁగవలయున్. ౩౮౦

కం॥ శుద్ధుడు కానిద్విజుఁడే శ్రాద్ధమునం దధికృతుఁడుగ నల్పంబడుఁ ద
చ్ఛ్రాద్ధంబు బూదినిడిన సమృద్ధ గవీఘృతమువోలె వృథయగు నధిపా! ౩౮౧

తే॥ అట్లు గావున విశ్వప్రయత్నముగను శోధనీయులు నాగరక్షోణిసురులు
ఆత్మకులమెల్లఁ బరిశుద్ధమగుటపాంటె నటులె స్వస్థానమును శుద్ధమగుటకొఱకు"

## —• ప్రేతశ్రాద్ధము •—

వ॥ అనియిట్లు వర్ణించుటయు వెండియు నాభూవల్లభుండు. ౩౮౩

ఉ॥ "నాగరవంశశుద్ధివిధి నాకు వచించితి విస్తరించి తా
నీ గ్రహచారమూలమున నెంతయు నష్టనిజాన్వవాయుఁడై
బాగుగఁ దల్లిదండ్రులనె బ్రాహ్మణసన్నిధిఁ జెప్పలేని యా
నాగరుఁ డెట్లు శుద్ధుఁడగు? న్యాయవిదగ్రణి! యానతీయుమా" ౩౮౪

వ॥ అని యడుగుటయు మఱియు నమ్ముని యిట్లనియె ౩౮౫

తే॥ "నన్ను నీవడిగినమాడ్కి నాగరులును భర్తృయజ్ఞుని నడిగి రీప్రశ్న మున్ను.
నష్టవంశునిమిత్తమై న్యాయమార్గ మెడఁద రోజించి యాతఁడప్పు డిట్లులనియె ౩౮౬

తే॥ నష్టవంశుండువచ్చి నే నాగరుండనను చు సభలోనఁ జెప్పుచో నతని శీల
మును బరీక్షించి ప్రథమంబు వెనుక శుద్ధినీయవలెఁ గాని యాపలకుం ద్రోయఁజనదు.

కం॥ నాగరధర్మములుం గడుబాగగు వ్యవహారములును బరికించి యటన్
దాఁగూడఁ బ్రవర్తించెడి నాగరు మన్నింపవలయు నయమార్గమునన్. ౩౮౮

తే॥ అతనిశుద్ధినిమిత్త మీయంగవలయు ఘటము. నది శుద్ధమైనచోఁ గర మతండు
శుద్ధుఁడును శ్రాద్ధయోగ్యుండు సోమపానయోగ్యుఁడుం గన్యకాయోగ్యుఁడుర్వియందు

తే॥ అఖిలమౌ స్థానకర్మమందతఁడు మఱి యోనగును సామాన్యపదయోగ్యుఁ"డనుచు నిటుల
భర్తృయజ్ఞుండు నాగరబ్రాహ్మణులకుఁ జెప్పె. నది యేను నీకును జెప్పినాఁడ.

ఆ॥ నష్టవంశుఁడైన నాగరునెడలనా నిది ద్వితీయశుద్ధి సదయహృదయ!
కనుక మఱియు నేమివిన నిచ్చగించెదో యడుగు ముత్తరంబు నుడువనుంటి" ౩౯౧

వ॥ అని యిట్లు వాక్రుచ్చుటయు వెండియు నానర్తధరాఖండలుండు ౩౯౨

సీ॥ "అగ్గలం బుగ్రమై యనయు సవ్యగ్రమౌ తపము పెంపున మహాధన్యులైరొ?
బహుదక్షిణాకమై పాపలుంటాకమౌ సుఖములనొనరించి మాన్యులైరొ?
వేదశాస్త్రార్థ్యమై విధ్వస్తమౌఢ్యమౌ చదువున లబ్ధసౌజన్యులైరొ?
యుపగతలోభ్యమై యనితరాలభ్యమౌ త్యాగంబునను ధూతదైన్యులైరొ?
యూర్జితంబైన యెదో హేతు వుండకున్న శుద్ధినెనసిన నాగరశ్రేణిసురుల
యందఱకు లేనియాత్కృష్ట్య పస్తరుణుల కెట్టులేర్పడె? చెప్పుము మునీంద్ర! నాకు"

వ॥ అని పృచ్ఛఁజేయుటయుఁ గుశికనందనుండు మఱియునిట్లనియె. ౩౯౪

ఉ॥ "నాగరులందఱుం గుణసనాథులె యైనను వీరికిం మహా
యోగమొకంటు పట్టి పురుహూతునిచేతను సుప్రతిష్ఠితుల్
గాఁగనొనర్చె నియ్యదియె కారణ మస్తకుల ప్రసూతులే
నాగరధారుణీసురజనంబున గౌరవభాక్కులై మనన్" ౩౯౫

వ॥ అని యిట్లు వచించుటయు నానర్తదేశవిభుండు ౩౯౬

తే॥ "ఎప్పుడావసుధామరు లిందుచేత సంప్రతిష్ఠితులైరి యీ స్థలమునందు?
బలిమి నేల ప్రతిష్ఠింపవలసివచ్చె? విస్తరంబుగ వాక్రువ్వవే మహాత్మ!" ౩౯౭

వ॥ అని ప్రశ్నించుటయు గాధిసూనుం డిట్లనియె. ౩౯౮

శిఖరిణి॥ "హిరణ్యాక్షుండన్ రాక్షసునకును నయ్యింద్రునకు సం
గరం బెంతో ఘోరంబుగ నగుడుఁ బ్రాక్కల్పమున నో
ధరాజానీ! యం దెందఱో పడిరిపో దైత్యులు సురల్
చిరం బన్యోన్యంబుం గడుఁబెనఁగి యోలిన్ నిహతులై ౩౯౯

తే॥ అంత నింద్రనిహతులైన యసురులెల్ల స్వగురువిద్యాబలంబున బ్రదుకఁజొచ్చి-
రొక్కరేనియు జీవంబునొందరైరి వేలుపులు. దానిఁజూచితా వెఱఁగుపడుచు

కం॥ ఒకనాఁ డింద్రుఁ డుపేంద్రుని నికటంబున కరిగి యిట్లనెను "లోకోద్ధా
రక! ధారాతీర్థంబునఁ బ్రకటుపరివారణములకును భయపడ కెడఁదన్ ౪౦౧

ఆ॥ ఎదుఱునడచువారి కేగతిగల్గునో ప్రాణభీతిచేతఁ బాఱిపోయి
మృతిని గాంచువారి కేగతిగల్గునో నాకు శ్రీజనార్దనా! వచింపు" ౪౦౨

కం॥ అనియడుగుడు మధుసూదనుఁ "డని ధారాతీర్థభూమి నభిముఖులై యీ
ల్గినవారు పునర్జన్మంబును జొందరు ఛిన్నబీజుపోల్కి సురేశా! ౪౦౩

చం॥ భయమునఁ బాఱుచున్ రిపుల బాణతతిన్ నిజపృష్ఠమందునన్
రయమునఁ గొట్టగాఁబడి ప్రణష్టకళేబరులైన భృత్యు లెం
తయు నిలఁ బ్రేతలయ్యెదరు" నాఁ బురుహూతుఁడు వెండియుం గడున్
నయమునఁ గేలుమోడిచి జనార్దనుఁగూరిచి భక్తి నిట్లనున్. ౪౦౪

ఆ॥ "కొంతమంది యసురు లెంతయు శూరులై పగర కెదురునడచి ప్రాణములను
విడిచి. రెంతొమంది వెన్నిచ్చిపాఱుచు నిహతులైరి యుద్ధమహిని దేవ! ౪౦౫

క॥ కావునఁ బ్రేతత్వం బీదేవతలకుఁగూడఁ గలిగితీరునొ లేకా
కావలులగు దానవులకె యేవంవిధనియతిగలదొ యెఱిఁగింపు" మనన్ ౪౦౬

క॥ "సందేహము లేకుండఁ బురందర! వెన్నిచ్చిపాఱి రణమున హతులౌ
నందఱును బ్రేతత్వమునందుదు రెవరైన నేమి. యదిగాక మఱిన్ ౪౦౭

తే॥ విషముద్రావియొ లేక యావీతిహోత్రునందు దూఁకియొ పడిసిన యాత్మఘాత
కులు కృతఘ్నులుగూడ నోకుధరభేది! యధికప్రేతవిగ్రహు లగుదు రవని ౪౦౮

తే॥ పసులకొమ్ములచేతఁ బొడ్వంగఁబడియొ వన్యమృగములకోఱల వ్రచ్చఁబడియొ
మృతినిగాంచినయట్టియర్ వృత్రహరణ! ప్రేతలయ్యెద రుజ్ఝితప్రీతులగుచు" ౪౦౯

క॥ అని మధుసూదనుఁ డనుటయు విని లేఖర్షభుఁడు మరల "విష్ణూ! యుత్నిం
తును గావునఁ బ్రేతత్వంబును వారు దొరంగు తెఱఁగు బోధింపు" మనన్ ౪౧౦

ఆ॥ "భాద్రపదమునందు బహుళచతుర్దశీతిథిని వారిఁగూర్చి దేవనాథ!
గయను భక్తిపూర్వకముగ శ్రాద్ధముఁబెట్ట ముక్తిగలుగు నిక్కముగను నపుడె" ౪౧౧

క॥ అని హరి పల్కుడు శక్రుం "డని శస్త్రచ్ఛిన్నదేహులగు వారికి నీ
దినమే యెటులయ్యె శ్రాద్ధమ్మునకై యన్నింటిలోన ముఖ్యం" బనఁగన్. ౪౧౨

క॥ "భూతప్రేతపిశాచము లాతతకూశ్మాండములును నమరారులుఁ బా
మేతద్వాసరమందున భూతేశుసకాశమునకుఁ బోయి యదృచ్ఛన్ ౪౧౩

క॥ "అరుణుఁడు కన్యారాశికిఁదిరిగిన యీసమయమందు దీనులమా మా
కొఱకై యొకదిన మీయవె కరుణను వంశజులు శ్రాద్ధకర్మము సేయన్. ౪౧౪

ఉ॥ తద్దినమందుఁ బెట్టఁబడు తద్దినమందు భుజించి వెండి మే
మద్దినమే గుదెంచుకఱ కాత్మను దృప్తినిబొందియుందు" మం
చొద్దికతోడ వేడుటయు నుగ్రుఁడనున్ "వినుఁ డీచతుర్దశిన్
దద్దయు భక్తి శ్రాద్ధమును ద్వత్కులసంజనితుండు పెట్టుచోన్. ౪౧౫

క॥ ఏడాదివఱకు క్షుధచేఁ బీడితులరుగారు మీరు. ప్రేతలు! చనుఁడీ.
యేఁడేని భవద్వంశపువాఁడు గయం బిండమిడిన వడిముక్తులరే. ౪౧౬

ఆ॥ శస్త్రవినిహతులకు స్వర్గమేన్ బ్రాప్తింప నిశ్చయముగఁ బ్రేతనేతలార!
యీదినమున శ్రాద్ధ మెవరికి నకృతమా నబ్దమెల్ల వారి కంగలార్పు. ౪౧౭

క॥ ఎవఁడీదినమున శ్రాద్ధముఁ దవిలి యొనర్పండొ భువిని దత్పితరులు క్షు
ద్వివశులయి వత్సరాంతము నవయుచునుండెదరటంచు నలువ వచించెన్ ౪౧౮

తే॥ అట్లుగావున సర్వప్రయత్నములను సలుపఁదగు నీచతుర్దశి శ్రాద్ధకర్మ
మద్ది యెవరినిగూర్చియే యగునుగాక ప్రేతలకుఁజెంది యధికమౌ ప్రీతిఁజేయు"

కం॥ అనియిట్లు చంద్రచూడుఁడు మును ప్రేతశ్రాద్ధమునకు ముఖ్యంబుగ నీ
దినము విధించెను జని నీకనుఁగులై యగుచో నొనర్పు మది వారలకున్ ౪౨౦

— గయాశ్రాద్ధఫలము —

మ॥ భవదర్థంబయి యుద్ధ్యమానులయిరో ప్రాణాలు గాపాడుకో
నవలం బాలుమఁ గొట్టఁగాఁబడిరొ యత్యంతంబు పృష్ఠంబునం
దెవ రాలంబున మిత్తివాతఁబడిరో యీ వేగి యవ్వారికిన్
సవిధానంబుగ నాచరింపుము గయాశ్రాద్ధంబు వృద్ధశ్రవా! ” ౪౨౧

ఆ॥ వారు తృప్తులగుచు వరుసగాఁ బ్రేతత్వమునను ముక్తులగుదు ” రని మురారి
యానతీయుటకును హరిహరాత్ముం డింకను నెదియొ తెలియఁగోరి యిట్టులనియె

మ॥ “ ప్రతివర్షంబును నీదినంబె గయకుం బద్మాసనుం డేగి త
త్పితృదేవార్థము శ్రాద్ధముం జలుపు గోవిందా! యటుల్గాన నే
నితమేన్ శ్రాద్ధముఁబెట్టుపొంటె నలుకుం బ్రీతుండనై పోదు నీ
క్షితి నింకొక్క మహాస్థలంబు చెపుమా శ్రేయఃప్రదం బేగదిన్ ” ౪౨౩

కం॥ అని యీరీతి వచించుచు మనమున ధ్యానించి చిరము మాధవుఁడపుడి
ట్లను “గలదు దానికంటెను ఘనమగు తీర్థంబె కూపికామధ్యమునన్. ౪౨౪

ఆ॥ హాటకేశ్వరమున నదియుండు దానిలో నఖిలతీర్థసహితమగుచు వచ్చి
సంక్రమించుగయ నృపా! తచ్చతుర్దశీదర్శతిథులయందుఁ దద్దమహిమ. ౪౨౫

మ॥ రవి కన్యన్ మన నష్టవంశభవవిప్రశ్రేష్ఠులం బిల్చి యం
దెవఁడేన్ శ్రాద్ధముఁ బెట్టుచోఁ బితరు లెంతేనిం దరింత్రింద్ర! యి
బ్భువిఁ బ్రేతత్వము నొందినట్టిరె కడుం బూతత్వముం దాల్చ నా
దివమందుండెడి వారిసంగతి యిఁకం దెల్పంగ నేముండెడిన్ ౪౨౬

తే॥ తన్మహాక్షేత్రమున సముద్భవముఁ జెందినట్టి యష్టకులోద్భవు లనఘులగుటఁ
జేసి యానర్తపతి యిచ్చు భూసువర్ణములను బట్టుట కొల్లక తొలఁగిపోయి ౪౨౭

ఆ॥ మంచుఁగొండపైని చంచలులై తపంబున్న వారు వారియొద్దకరిగి
సామపూర్వమైన సదుపాయములచేత గౌరవంబుఁ జూపి కడుజవమున. ౪౨౮

తే॥ తోడుకొనివచ్చి వారియెదుట యథావిధిగను శ్రాద్ధంబుఁ బెట్టుము తీరు నీదు
నభిమతము వచ్చినటువంటి యష్టకులజు లచట సుఖముండుదురు త్రిదివాధినాథ!

కం॥ నీతోపాటుగ మేమును నేతద్భూసురుల శ్రాద్ధహేతువుచేతన్
బ్రీతిం బూజించెద ” మని యీతీరునఁ బల్కి యంబుజేక్షణుఁ డంతన్. ౪౩౦

ఆ॥ పాలకడలికరిగెఁ బరమహర్షముఁ జెంది తత్క్షణంబ లేచి తద్బలారి
హిమనగంబుఁ జేరి యీక్షించె దత్రత్యులైన యష్టకులుల నగ్రజనుల ౪౩౧

౮ వేలూరి రామన్నగుప్తగారు, సదాశివుని పేట
౯ రాయచూరి బండేరావుగారు, అయినాపురం.
౧౦ రాచూరి సుబ్బయ్యగారు - శ్రీ శ్రీ విరూపాక్షుసంస్థాన ప్రధానమంత్రి
౧౧ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం
౧౨ దండు గుండేరావుగారు, కరణము - ముసలాపురం
౧౩ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు - ముసలాపురం
౧౪ కాడుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట
౧౫ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల
౧౬ భాస్కరరాయుని వెంకటరామయ్యగారు, వంగపల్లి
౧౭ నరసింహస్వామివారు, యాదగిరి
౧౮ బీరకాయల హనుమంతరావుగారు, రాయగిరి
౧౯ జూలూరి వెంకటరత్నముగారు, వకీలు, గుంటూరు
౨౦ మెదక్ కిషన్‌రావు దేశముఖుగారు, నల్లపల్లి
౨౧ జానపాటి సుబ్రహ్మణ్యంగారు, ప్లీడరుగుమాస్తా, గురిజాల.
౨౨ వెలిదెండ్ల సత్యనారాయణగారు - కరణం, చింతిరాల.
౨౩ కవులూరి నరసింహారావుగారు, రివిన్యూయిన్స్పెక్టరు - పిడుగురాళ్ళ
౨౪ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసబిన్స్పెక్టరు, ప్రత్తిపాడు
౨౫ రాచకొండ వెంకటరామయ్యగారు, యొనమదల
౨౬ కప్పగంతు సుబ్బారావుగారు - పోలీసుసబిన్స్పెక్టరు - బొల్లాపల్లి
౨౭ ముండ చినవెంకయ్యగారు, దండమూడి
౨౮ శ్యామాపంతుల గోపాలరావుగారు - హైదరాబాద్.
౨౯ కన్నయ్యగారిసంగయ్యగారు-ముసలాపురం
౩౦ చక్కిలం పాపయ్యగారు-ముసలాపురం
౩౧ తాళ్ళవలిమె లింగన్న మొకద్దంగారు-గడిపెద్దాపురం
౩౨ కిషన్‌రావు దేశపాండ్యాగారు తాళ్ళపల్లి
౩౩ సుబ్బారెడ్డి దేశముఖుగారు, క్షీరసాగరం
౩౪ చివుకుల శ్రీరామశర్మగారు- నాగులుప్పలపాడు
౩౫ గజవాడ వెంకటాచార్యులుగారు, అల్లాదుర్గము
౩౬ కాకిరాల రామచంద్రయ్యగారు, మముదాపురము
౩౭ లక్ష్మీనారాయణ గౌడు సెట్టిగారు, అందోలు
౩౮ ఇటికాల రాజేశ్వరరావుగారు - వకీలు కంభంమెట్టు
౩౯ వెలమకన్ని శోభనాద్రిరావుగారు - శోభనాద్రిగూడెం.
౪౦ నారపరాజు వెంకటలక్ష్మీనరసింహారావు దేశముఖుగారు - తమ్మవరం.
౪౧ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యుల అయ్యవార్లంగారు - కాతాపురం.
౪౨ కొండంభట్లగారి వెంకన్నగారు. గుమ్మడిదల